# గురజాడ 150వ జయంతి, చిన్నప్ప భారతి పురస్కార ప్రదానోత్సవ దృశ్యాలు

## శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, సెనేటు హాలు, తిరుపతి




చిన్నప్ప భారతి పురస్కారం అందుకుంటున్న అద్దేపల్లి రామమోహన రావు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, సెనేటు హాలులో వేదికపై ఆసీనులైన చిన్నప్పభారతి(ఎర్ర శాలువ) తదితరులు



తెలకపల్లి రవి సభాధ్యక్షులు | డా. రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి | శ్రీనివాసులు రెడ్డి, ఎం.ఎల్.సి. | యతిరాజులు, అనువాదకులు | ప్రొ॥ డా. కె. ఆశాజ్యోతి బెంగళూరు



ఎస్.వి. యూనివర్శిటీ తమిళ విభాగం ప్రతినిధులు, చిన్నప్పభారతి ట్రస్టు సభ్యులు

PRSUMOR A132

సాహిత్య ప్రస్థానం
డిసెంబర్ 2011
సంపుటి : 11 సంచిక : 71

# చిల్లర బ్రతుకులు ఛిద్రం

ధరల పెరుగుదల, వ్యవసాయ సంక్షోభం, ఉపాధి రాహిత్యం వంటి సవాలక్ష సమస్యలతో ప్రజలు సతమతమవుతుంటే పాలకుల చర్యలన్నీ బతుకులను మరింత చితగ్గొట్టేవిగా వుంటున్నాయి. పెన్షన్ సంస్కరణలు, చిల్లర వ్యాపారంలో వాటికి ద్వారాలు తెరవడం వంటివి పరిస్థితిని మరింత దిగజార్చడానికే దారితీస్తాయి.

మధ్యతరగతి ఉద్యోగులు జీవితమంతా శ్రమించి నిల్వ చేసుకున్న పెన్షన్‌పై అనేక విధాల దాడి చేయడమే గాక దాన్ని మ్యూచువల్ ఫండ్స్‌కు మళ్ళించడానికి నిర్ణయించడం, అందులోనూ విదేశీ పెట్టుబడులను అనుమతించడం దారుణమైంది. ఆ దెబ్బ నుంచి కోలుకునేలోగానే చిల్లర వ్యాపారంలో వాల్‌మార్ట్ వంటి బహుళ జాతి తిమింగలాలను స్వాగతించాలని నిర్ణయించారు. దేశంలో వ్యవసాయం తర్వాత అత్యధికులకు స్వయం ఉపాధి కలిగిస్తున్న ఈ రంగంలో వాటిని రానివ్వడం అత్యంత వినాశకరమైన నిర్ణయం.

ఈ దేశంలో వెయ్యికి ఒక చిన్న దుకాణం చొప్పున వుంది. వీటిపై 4 కోట్ల కుటుంబాలు ఆధారపడి వున్నాయి. సామాన్య జనానికి కూడా ఇవి అందుబాటులో వున్నాయి. కాని వాల్‌మార్ట్ వంటి సంస్థల రాకతో ఇవి మూతపడక తప్పదు. దానివల్ల వాటి యజమానులు వీధుల్లో పడటమే గాక సామాన్య ప్రజలు కాస్తో కూస్తో పప్పు, చింతపండు వంటి వినిమయ సరుకులు తెచ్చుకోవడం కూడా ఇబ్బందిగా మారుతుంది. ఎందుకంటే అడుగు పెట్టడానికే కళ్ళు తిరిగే భారీ మాల్స్ వరకూ వారు వెళ్ళలేరు. ఇవి మొదట్లో కాస్త సరసంగా అనిపించినా వామనుడి మూడో పాదంలాగా అన్నిటినీ ఆక్రమించిన తర్వాత రైతులను, కొనుగోలుదార్లను కూడా పిప్పిచేస్తాయి. వినిమయ సంస్కృతి మరింత విజృంభించుతుంది. ఉత్తరోత్తరా అధిక ధరలతో పాటు ఆహార భద్రత కూడా దెబ్బతినిపోతుంది. కేంద్ర ప్రభుత్వ భాగస్వాములతో సహా అన్ని తరగతులూ వ్యతిరేకిస్తున్న ఈ నిర్ణయంపై పునరాలోచన అవసరం.

ముఖచిత్రం: సూర్యప్రకాశ్ (ప్రత్యేక వ్యాసం లోపలి పేజీల్లో..)

బొమ్మలు : చంద్ర, శివాజీ, వెంకటేష్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# ఆనందమే జీవిత మకరందం



- సత్యాజీ
సెల్: 9490099167

**నల్లమబ్బులు కమ్ముకున్న ఆకాశం ఏ క్షణాన్నయినా కుంభవృష్టి కురిసేలా ఉంది. మూ్డ్రోజులనుంచి ఏకధారగా కురుస్తూనే ఉంది. ఈ పొద్దున్నుంచే కాస్త తెరిపిచ్చింది.**

కొండగెడ్డ హోరున పారుతోంది. ఆ వొడ్డూ ఈ వొడ్డూ ఒరుసుకొని ఎర్రనీరు ప్రవహిస్తోంది. పెద్దపెద్ద చెట్లూ, తుప్పలూ డొంకలూ కొట్టుకొస్తున్నాయి. రౌద్రరూపం దాల్చినట్టూ ఎర్రనీరు సుడులు తిరుగుతూ పోతోంది.

గంటనుంచి వంతెనపై కూర్చొని తదేకంగా చూస్తున్నాడు రామనాథం. అతడి మనసంతా అల్లకల్లోలంగా ఉంది. అతడి చూపు. ఆ పొడవాటి దుంగ మీదే ఉంది. అది ఏ కొండవాలు నుంచో కొట్టుకొచ్చింది. నీటి ప్రవాహానికి అడ్డంగా ఉన్న ఓ తుప్పలో చిక్కుకుపోయింది. దానిని కదిలించటానికి ప్రవాహం ప్రయత్నిస్తూనే ఉంది. ఆ దుంగ చివరి దృశ్యం అతడి చూపును మరల్చుకోకుండా చేస్తోంది.

ఓ పాము ప్రాణభయంతో దుంగను చుట్టుకొని ఉంది. దానిలాగానే దుంగపైకి చేరిన కప్పను అది చాకచక్యంగా నోటికి చిక్కించుకొంది. దాన్నుంచి బయటపడటానికి సర్వశక్తులూ వొడ్డి ప్రయత్నిస్తోంది కప్ప. తన పట్టు మరింత బిగిస్తోంది పాము. హృదయవిదారకంగా అరుస్తోంది కప్ప. ముందరి కాళ్లతో దుంగను గట్టిగా అదిమిపెట్టి – తన శరీరాన్ని పాము నోటిలోంచి లాక్కోవటానికి ప్రయత్నిస్తోంది. తోక భాగాన్ని మరింత బిగించి, ముందరి భాగం వదులు చేసుకొని కప్పను స్వాహా చేయడానికి సన్నద్ధమవుతోంది పాము.

వరద ఉధృతికి దుంగ ఏ క్షణాన్నయినా ప్రవాహంలో కొట్టుకుపోవొచ్చు. అలా జరిగితే కప్పా, పామూ రెండూ నీటిపాలు కాక తప్పదు. నిజానికి రెండూ ప్రాణరక్షణ కోసమే దుంగమీదికి చేరాయి. అంత ఆపత్కాలంలోనూ పాము తన సహజ లక్షణం వదులుకోలేదు. కప్పను అమాంతం పట్టేసి, క్షుద్బాధ చల్లార్చుకోవడానికి తాపత్రయపడుతోంది.

రామనాథం అటువైపే చూస్తూ – ఆలోచిస్తున్నాడు.

పాము పట్టు సాధించినట్టే ఉంది. కప్ప నీరసించిపోయింది. దాని అరుపులు ఇందాకటంత ఉధృతంగా లేవు. ఎక్కడో నూతిలోంచి వస్తున్నట్టుగా ఉంది దాని గొంతు. చావు ఖాయమని తెలిశాక కూడా కప్ప ఎందుకంత ఆరాటపడిపోతుంది? ఏదోలా అది పాము పట్టునుంచి తప్పించుకున్నా బతకగలదా? ఈపాటికే విషపు కోరలు దిగి ఉంటాయి. ఒంటినిండా గాయాలయ్యే ఉంటాయి.

తాను కర్రో, రాయో విసిరితే పాము పట్టు సడలిస్తుంది. కప్ప దాన్నుంచి బయటపడుతుంది. కానీ, ఏమిటి లాభం? కప్ప ఇక బతకదు. ఈరోజుతో దాని బతుకు అయిపోయింది. విడగొట్టినా –

ప్రవాహంలో పడి కొట్టుకుపోతుంది. ఈ పరిస్థితిలో ఈది, ప్రాణాలు నిలుపుకోవటం సాధ్యమయ్యే పని కాదు. వదిలేస్తే కనీసం పాముకి ఆహారం అయినా దొరుకుతుంది అనుకున్నాడు.

ఇంకో అరగంట గడిచిపోయింది. కప్ప అరుపులు పూర్తిగా ఆగిపోయాయి. దాని కథ ముగిసిపోయింది. పాము నెమ్మదిగా పట్టు సడలించి, కప్పను గుటకాయ స్వాహా చేసేందుకు సన్నద్ధమవుతోంది. పరిస్థితి ప్రతికూలంగా ఉన్నప్పుడు ఎదురీదడం వృథా ప్రయాస... తాను అనుకున్నదే అయింది అనుకున్నాడు. మనసులో అలా అనుకున్నప్పుడు అతడి పెదాలపై బలహీనమైన నవ్వు ఒక్కక్షణం విరుసుకొని. అంతలోనే మాయమైంది. మనసునిండా అసంతృప్తి. హఠాత్తుగా తీవ్రమైన తల్నొప్పి మొదలైంది. కుడిచేత్తో నుదురు. కణతలూ గట్టిగా నొక్కుకున్నాడు.

ఆ క్షణంలో... అనూహ్యంగా... కప్ప ఒక్కసారిగా గట్టిగా అరుస్తూ పాము పట్టునుంచి తప్పించుకొంది. తప్పించుకోవడంతోనే ఇంతెత్తున ఎగిరి – అప్పుడే ఆ పక్కగా కొట్టుకువస్తున్న తాటిమట్ట మీదికి గెంతేసింది. పాము కూడా అటు వెళ్లబోయి – ప్రవాహం కారణంగా సాహసించలేకపోయింది.



ఆశ్చర్యపోయాడు రామనాథం.

చేష్టలుడిగి, అలా చూస్తూ ఉండిపోయాడు.

కప్ప వెనక భాగమంతా పాము నోట్లో పడి, బాగా చచ్చుపడిపోయింది. ఒక కాలు దెబ్బతిన్నట్టుగా కనిపిస్తోంది. అది ఆసరాగా చేసుకున్న తాటిమట్ట ప్రవాహంలో కొట్టుకుపోతూనే ఉంది. చూపును దాటి వెళ్లిపోయేదాకా దానిని చూస్తూనే ఉన్నాడు.

చినుకులు టపాటపా రాలడంతో ఈలోకంలోకి వచ్చాడు.

మనసు స్థిమితంగా లేదు. ప్రశాంతంగా లేదు.

కిందికి చూశాడు. దుంగ... దుంగపైన పాము.. కనిపించాయి.

పాము కప్ప గురించి మర్చిపోయి వేరే ఆహారం కోసం ఎదురుచూస్తోంది.

చినుకులు ఎక్కువవుతున్నాయి. ప్రస్తుతానికి ఎక్కడైనా తలదాచుకోవడం మంచిదని అటూఇటూ చూశాడు. దూరంగా కనిపించిన చుట్టిల్లు వైపు పరుగుతీశాడు.

.. .. ..

మట్టిగోడలతో కట్టిన ఆ చుట్టింట్లోకి ఎటువైపునుంచి దూరాలో అర్థం కాలేదు, తొలుత. హడావిడిగా తచ్చాడుతుంటే – లోపలనించి 'ఇటూ... ఇటూ... ఇలా రండి...' అని కేకేశారు ఎవరో.

వెనకనుంచి దక్షిణంవైపు వెళితే – ముంజూరు కాస్త పైకి ఉంది. కాస్త వొంగొని లోపలికి దూరాడు. అప్పటిదాకా నులకమంచంమీద కూచొని ఉన్న భార్యాభర్తలు ఒక్కసారిగా లేచారు.

'ఏ వూరు బావూ.... ఇలా మంచమ్మీద కూకొండి. ఈ వాన ఇంకో అరగంటదాకా వదల్దు.' అన్నాడు మగమనిషి. అతడి పేరు అప్పలనాయుడు.

రామనాథం బట్టలు అరరగా తడిచాయి. తలనుంచి నీళ్లు కారుతున్నాయి. మగ మనిషి గదిలాగా ఉన్న పంచోదులోకెళ్లి – ఒక పొడి తువాలుతో బయటికి వచ్చాడు.

'దీంతోటి కాస్త తలా, వొళ్లూ తుడుచుకొండి.' అని రామనాధానికి అందిచ్చాడు. 'ఎందాకా బయల్దేరారో...' అనడిగాడు.

రామనాథం ఆ తువ్వాల్తో తల తుడుచుకుంటూ, మంచమ్మీద కూచున్నాడు. నులక వదులై పోయి మంచం లోతుగా ఉంది. అతడడిగినదానికి ఏం చెప్పాలోనని తటపటాయించాడు. బయట వర్షం జోరందుకొంది.

'ఊ... ఇంక సేను ఉన్నకాడకీ పోతాది...' అంది ఆడమనిషి విచారంగా. ఆమె అతడి భార్య, అప్పలనర్స.

'ఏటీ సేత్తాం.... రెండేళ్లు వరసగా కొరువు. సిటుక్కుమని సినుకు నేదు. యీ యేడు వద్దంటే వాన. వర్సానికే పండింది. వర్సానికే పోతాది.' నిట్టూర్చాడు అప్పలనాయుడు.

'మన కట్టం, పెట్టుబడీ...' తనలో తానే అనుకున్నట్టుగా బయటికే అంది.

'ఏమన్నా మిగిల్తే అదే దక్కుల్లు... అన్నాడు.

'ఇంక ఈ ఏడూ విడిపించడం అవదన్నమాట...!

'ఒహో.... నీ మనసంతా అటికేసే నాగుతుందన్నమాట... ఈ ఏడు పంటంతా చేతికొత్తే.. అది ఇడిపించటమేంటి? ఇంకో రొండు తులాలు కొనేద్దునే...' అన్నాడు నవ్వుతూ.

'అ.. ఇప్పటికే శానా కొనేశావు. ఆ నగలెట్టుకొని తిరుగుతుంటే నడుం వొంగుపోతుంది....' నిష్టూరమాడింది.

'నడుం వొంగిపోకుండా ఉండాలంటే వొడ్డానం సేయించాలే.... ఈ ఏడు బాగుంటే అదే సేయించేద్దును...' అతడింకా రెచ్చగొడుతున్నాడు.

'వొడ్డానాలు మాటికేం బావూ... మా అత్తగోరు పెట్టిన ఆ తాడన్నా ఇడిపించు చాలు.... సావుకారు దగ్గర తనకా పెట్టి మూడేళ్లవుతుంది. ఎప్పుడికప్పుడే సేతికి వొచ్చేత్తంది అనుకుంటన్నం. తీరా దగ్గరకొచ్చేసరికి కత మళ్లీ మామూలే,,,'

రామనాథానికి వాళ్ల సంభాషణా. దాని నేపథ్యమూ కొద్ది కొద్దిగా అర్థమవుతోంది. వాళ్లు మాటల్లో పడి తనను దాదాపు మర్చిపోయినట్టే ఉన్నారు. తన గురించి చేప్పేలోగానే మాటల్లో పడిపోయారు. వాళ్లు బాధపడుతున్నారో. ఎకసెక్కాలాడుకుంటున్నారో అర్థం కావటం లేదు. బాధల మధ్యలో మామూలు మాటలూ, నవ్వులూ ఎలా సాధ్యమవుతున్నాయో బోధపడడం లేదు. ఆసక్తిగా వాళ్లనే గమనించసాగాడు.

ఒక్కోసారి అతడు దిగాలు పడతాడు. ఆమె ధైర్యం చెబుతోంది. 'ఇంక ఈ బతుకింతే....' అంటాడు. 'బతకడానికెందుకు బెంగ... పరమట కూటికి పోయినా రెండు నెలల్లో పదేలు పట్టుకురావొచ్చు' అంటుంది ఆమె. అంతలోనే 'మెడలో బంగారం నేకుండా వచ్చే నెల్లో తమ్ముడి పెల్లికి ఎల్లడం ఎలాగా...' అని బెంగ పడుతుంది. 'అప్పుడికి ఏదోనాగ ఆ తాడు ఇడిపించే పూచీ నాది' అని బరోసా పలుకుతాడు అతడు. మధ్యమధ్యలో ఆనికాలు. 'బంగారం నేకపోయినా బలేగుంటావులే నువ్వు' అతడి మోములో కొంటె నవ్వు. 'ఇలాటి మాటలతోనే నెట్టుకొచ్చేత్త న్నావు...' ఆమె కన్నుల్లో మెరుపు తోటి ముసిముసిగా నవ్వుతోంది!



బయటి వర్షంలాగానే వాళ్ల సంభాషణ కొనసాగుతూనే ఉంది.

వచ్చో, రాకుండానో అప్రయత్నంగానే చిన్న దగ్గు దగ్గాడు రామనాథం. ఎవరో వీపు మీద చరిచిననట్టు నిశ్శబ్దమై పోయారు ఇద్దరూ.

.. .. ..

'బాబూ.. ఈ వాన తగ్గేటట్టు నేదు. మొన్న కూడా ఇంతే! పొద్దేపేళ నెమ్మదిగా మొదలైంది. రేత్రికి ఊపందుకొంది. ఏగినంతసేపూ బదాబదా కురుస్తానే ఉంది. పొద్దున సద్దేళకి కానీ, వదల్లేదు. ఎక్కడనేని గంగా పొంగిపోయింది. ఇయ్యాల కోయాల్సిన మా వరిసేను నిండా మునిగిపోయింది. కొండగెడ్డ జోరుజోరుమని పారింది. గట్టు తెగిపోయి నీరంతా పొలాన్ని ముంచేసింది. ఈరోజు ఈపాటికి కోత పూర్తవ్వల్సిన సేను పూర్తిగా నేలనంటేసింది. ఇంకా మల్లనిండా నీరే ఉంది. సేను ఈ ఏడాది ఇరగపండింది బాబూ.... పంటంతా చేతికొత్తే అప్పులు తీరిపోయి, గట్టున పడతామనుకున్నాం. కానీ, నాబం నేకుండా పోయింది. ఇంక ఈ వానకి అంతా కుదేలే... రైతన్నవోడు ఎప్పుడూ ఇంక ఎత్తిరెల్లడు.' చెప్పుకుంటూ పోతున్నాడు అప్పలనాయుడు.

బయట వర్షం అంతకంతకూ ఎక్కువవుతోంది. చినుకుల ధాటికి ఆ చుట్టిల్లికి చిల్లులు పడ్డట్టు కారడం మొదలెట్టింది. అక్కడక్కడ ఆ ధారలకు మట్టితో అలికిన నేల కన్నాలు పడిపోతోంది అలాటి చోట గిన్నెలూ, తపాళాలూ పెడుతోంది అప్పలనర్స. అప్పలనాయుడు పైకి లేచాడు. ఎక్కడెక్కడ కారుతుందో జాగ్రత్తగా పరిశీలించాడు. ఇంటి ఇలగంత వేపుకెల్లి, రెండు పొడి తాటికమ్మలు పట్టుకొచ్చాడు. కారుతున్నచోట కొమ్మలను పైకెత్తి – దానిని అలాగే పట్టుకొమ్మని భార్యకు పురమాయించాడు. ఎరువులతోపాటు వచ్చిన గోనెను లోపలినించి మధ్యలోకి మడిచి, పొడవైన టోపీలాగ చేశాడు.

'ఇంత వర్సంలో ఎందుకూ?' అంది అప్పలనర్స.

'ఎక్కడ కారతందో ఇప్పుడైతేనే సరిగ్గా తెలుత్తాది.' అంటూ గోనె టోపీని నెత్తిన పెట్టుకొని ముంజూరు దాటి బయటికి వెళ్లాడు.

నిచ్చెన సాయంతో ఇల్లెక్కి, ఆమె ఎత్తిపట్టుకొన్నచోట కొత్త కొమ్మలు జొనిపించాడు. ఆ మరమ్మతుతో ఇంచుమించు ఇల్లు కారడం ఆగిపోయింది.

అప్పలనాయుడు తల తప్ప – మనిషి పూర్తిగా తడిచిపోయాడు. చలి వణికించడం మొదలైంది. ఆమె అప్పటికే కుంపటి రాజేసి, అతడి ముందుకి తోసింది.

చేతులు కాసుకుంటూ, 'కాస్త టీనీల్లు కాయరాదూ..... ఈయన చుట్టంనాగ ఇంటికొచ్చినా ఇప్పటిదాకా ఏ మరియాదా సేయనేదు...' అన్నాడు అప్పలనాయుడు.

'మాటల్లో పడి మరిచేపోయాను.' అందామె నొచ్చుకుంటూ.

పొయ్యి రాజేసి, కొద్దిసేపటి తరువాత రెండు స్టీలు గ్లాసుల్లో వేడి వేడి టీ తీసుకొచ్చి ఇచ్చింది ఇద్దరికీ. చలి, వర్షంతో ముడుచుకుపోయిన శరీరానికి అమృతంలా అనిపించింది తాగుతూ ఉంటే! హాయిగా ఉంది ప్రాణానికి.

'బాబూ.... ఎలాగుందో మా ఇంటి టీ. పాలు మా ఆవువే. టీకి, మజ్జిక్కి సేరుడు ఉంచుకొని మిగతావి డెయిరీకి పోస్తాం. ఎలా లేదన్నా వారానికి రెండొందల యాభై వత్తాయి. ఓ విధంగా సెప్పాలంటే ఆ ఆవే మమ్మల్ని పోసిస్తాంది.' అన్నాడు నవ్వుతూ.

ఏమిటి వీళ్ల పద్ధతి? ఏదో ప్రశ్న అడుగుతారు. కానీ, సమాధానం ఆశించడం లేదు.

వాళ్లు చెప్పాల్సింది చెప్పుకుపోతున్నారు.

అయినా, తాను చెబుదామన్నా ఏం చెబుతాడు?

.. .. ..

మీకేమన్నా మరియాద సేద్దామన్నా ఇది ఊరు కాదు బాబూ.... కాలవదాటి రెండడుగులు వేస్తే ఊరొస్తాది. అక్కడైతే ఏమన్నా దొరుకుతాయి. కానీ, వదలని వర్సం. ఉప్మా సేద్దామన్నా ఇంట్లో ఏమీ నేవు...' అందామె సంజాయిషీ చెబుతున్నట్టుగా.

రెండేళ్ల కితం దాకా మేమూ ఊళ్లోనే ఉండేవోళ్లం బాబూ..... ఆరోజు సొంకురాత్రి ఎల్లిన మర్నాడు. ఎవరి పనుల్లో వాళ్లున్నాం.

వొటేలు వెంకట్రావు గారింట్లో ఎలా పడిందో పడింది నిప్పు. కళ్లు తెరిసేలోగా ఊరంతా అంటుకుపోయింది. మా ఇల్లూ కాలిపోయింది. బట్టలూ, గింజలూ, కుంచాలూ మంచాలూ అన్నీ బూడిదై పోనాయి. ఆ తరువాత ఇదిగో కల్లం దగ్గరే ఈ చుట్టిల్లు కట్టుకొని, ఉంటన్నాం.' అంది.

ఊళ్లో కన్నా ఇక్కడే బాగుంది బాబూ.... గొడ్డూగోదాం దగ్గరుండి సూస్కోవొచ్చు. సెట్టూ సేమా పక్కనుండి సక్కబెట్టుకోవొచ్చు....' అన్నాడు అప్పలనాయుడు.

'పిల్లలూ....' అన్నాడు రామనాథం.

ఒక్క క్షణం మౌనంగా ఉండిపోయారు భార్యాభర్తలిద్దరూ.

తరువాత ఆమెనే నోరు విప్పింది.

మాకు మేమే పిల్లలం బాబూ.... ఇతను నాకు పాపాయి. నేను ఇతనికి పసిపిల్లని. ఇంకా కాలచ్చేపానికీ, కళ్లారా సూసుకోవడానికీ ఈ సేనూ, చెట్టూ, గొడ్లూ ఉండనే ఉన్నాయి.' అంది నవ్వేస్తూ.



విషయం అర్థమైంది. సంతానం లేని చాలామంది దంపతులను అలాంటి ప్రశ్న ఎంతగా బాధిస్తుందో తనకు తెలుసు. అనవసరంగా అడిగానే అని బాధపడ్డాడు.

తానూ అలాంటి ప్రశ్నలు రెండేళ్లనుంచి ఎన్నో ఎదుర్కొన్నాడు. లోపం ఎవరిలో ఉందో ఏడాది క్రితమే తెలిసింది. తన భార్య ద్వారా పిల్లలు పుట్టరని పరీక్షల్లో తేలిపోయింది. తలపై పిడుగుపడ్డట్టు అయింది. అప్పలనర్స ఆలోచించినట్టుగా తాను ఆలోచించలేకపోయాడు. ఎప్పుడూ పైకి అనలేదు కానీ, ఆమెనే కారణం అన్న భావన ఆమె పట్ల నిరాదరణని పెంచింది. ఇంట్లో చికాకులు మొదలయ్యాయి. ఏదో అసంతృప్తితో, అసహనంతో మామూలు మాటలు కూడా కాసేపటికి ఈటెలుగా మారిపోయేవి. ఆమె రోజంతా ఏడుస్తున్నట్టే ఉండేది. తాను ప్రశాంతంగా ఉండలేకపోయేవాడు. పట్టణంలో బాగా పేరున్న వ్యాపారవేత్తే అయినా, వ్యాపారంపైనా ఎక్కువగా కేంద్రీకరించలేకపోయాడు. ఫలితంగా వ్యాపారంలో ఒడుదుడుకులు. స్నేహితులతో సైతం మనసువిప్పి మాట్లాడుకోలేని పరిస్థితి! నిజం చెబితే – దూరం పెడతారేమోనన్న భయం. ఉన్న గౌరవమర్యాదలు ఒక్కసారిగా కుప్పకూలిపోతాయోమోనని బెరుకు! ఎప్పుడూ హాయిగా ఉన్నట్టు. లక్షలు సంపాదిస్తున్నట్టూ.... అవతలి వాళ్ళు గుర్తించటం కోసం పార్టీలూ, హోదా కోసం అట్టహాసాలూ.... ఏడాదంతా ఒక సమస్యలోంచి బయటపడాలని ప్రయత్నించి. మరింత కూరుకుపోవడమే అయింది. అప్పులు అనివార్యమయ్యాయి. అంతకంతకు పేరుకుపోయాయి.

భార్యతో మనసు విప్పి మాట్లాడలేని ఒంటరితనం. భౌతికంగా ఆమెతో కలిసి ఉన్నా ఏకాంతం. నెలల తరబడి నిద్రలేని రాత్రులు. ప్రశాంతత లేని రోజులు. తన పరిసరాల్లో. పరిచయస్తుల్లో ఇప్పటికీ తాను గౌరవప్రదమైన వ్యక్తే!

కానీ. మనసునిండా నిరాశానిస్పృహ!

ఆ నిస్పృహతోనే తాను... మొన్నటి పత్రికలో చదివాడు... కొండగెడ్డలోకి దూకి... ప్రేమ జంట ఆత్మహత్య

ఆ రాత్రి టీవీ క్రైంవాచ్‌లో 'ఆత్మహత్యలకు కేరాఫ్‌గా మారిన కొండగెడ్డ' అన్న ప్రత్యేక కథనం కూడా ఆసక్తిగా చూశాడు.

ఏదో నిర్ణయానికి వచ్చినవాడిలా ఈ ఉదయమే బస్సులో బయల్దేరి, ఇక్కడికి చేరాడు.

.. .. ..

ఆ కప్పా పాముల జీవన్మరణ పోరాటం ఆ కొద్దిసేపూ తనకు నిర్వేదంగానో, విచిత్రంగానో తోచి ఉండకపోతే......

చినుకులు ఒక్క ఉదుటున ఈ ఇంటివేపు తరిమి ఉండకపోతే.....

అంతకుమించి ఆలోచించటానికే భయమేసింది!

ఆ చుట్టిల్లు ఇప్పుడు తనకొక బోధివృక్షంలా తోస్తోంది. కొద్ది నిమిషాల, గంటల పరిచయంలోనే, పరిశీలనలోనే ఆ రైతు దంపతులు అద్భుతంగా కనిపిస్తున్నారు. నిండా సమస్యలున్నా చాలా సాధారణంగా తీసుకుంటున్నారు. ఒంటరిగా చేలో – వానకు కారుతున్న గుడిసెలో – ఏ వినోదం లేకుండా – ఏ సౌకర్యాలూ సదుపాయాలూ లేకుండా – కనీసం కరెంటు కూడా లేకున్నా, వరుసగా మూడేళ్ల నుంచి వ్యవసాయం నష్టాలకు గురవుతున్నా – ఇప్పుడూ పడ్డ కష్టమంతా నీటి పాలవుతున్నా – తాకట్టులో ఉన్న చిన్నపాటి నగను విడిపించుకోలేకపోతున్నా – వాళ్లు ఎలా నవ్వగలుగుతున్నారో? ఎలా జీవించగలుగుతున్నారో?

ఆ రాత్రంతా ఆలోచిస్తూనే ఉన్నాడు. ఏ తెల్లవారు జామునో నిద్రపోయాడు.

.. .. ..

ఉదయం లేచేసరికి అంతా ప్రశాంతంగా ఉంది.

మబ్బులన్నీ మాయమైపోయాయి. సూర్యుడు బ్రహ్మాండంగా మెరిసిపోతున్నాడు. తలారా స్నానం చేసినట్టున్న ప్రకృతి మిలమిలా మెరిసిపోతోంది.

అతడూ – ఆమె పొలంలోకి దిగారు. గట్లు తెగనరికి – మళ్ల నుంచి నీరు తీసే పనిలో ఉన్నారు. అతడు పారతో మట్టిపెళ్లలు తొలగిస్తుంటే ఆమె చెత్తో దారి తీస్తూ నీటి కాల్వలోకి మళ్లిస్తుంది.

# నవంబర్ నెల పురస్కారాలు





## లోకమారాణి

కథకు........రూ.700/-

రచయిత : డా॥ పెళ్ళకూరు జయప్రదా సోమిరెడ్డి

## రెక్కలు

కవితకు.......రూ.500/-

రచయిత : సిహెచ్. వి. బృందావనరావు

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

ముంపు నుంచి బయటపడ్డ పంటను మురిపెంగా చూసుకుంటున్నారిద్దరూ. అక్కడక్కడ నేల కొరిగిన చేనును పసిపిల్లల్లా పాయదీసి, పదిలంగా పైకెత్తి, కుదురుగా నిలబెట్టి కట్టుకట్టడం ఆరంభించారు. ఆ ఇద్దరే కాదు. పొలాల నిండా అవే దృశ్యాలు. ఆడామగా అందరూ కలిసి చేనును నిలబెట్టే ప్రయత్నంలో ఉన్నారు. నిన్నటి విధ్వంసంలోంచి పునసృష్టి చేస్తున్నారు. కూలిన ఆశాసౌధాలను తిరిగి నిలబెడుతున్నారు.

అప్పలనాయుడు ఏదో కూనిరాగం తీస్తున్నాడు.

అప్పుడే పొలంగట్టుమీదికి వచ్చిన రామనాథానికి అదంతా సంభ్రమంగానూ, అపురూపంగానూ అనిపించసాగింది. అతడిని చూసి, నడుంపైకెత్తి నించున్నాడు అప్పలనాయుడు.

ఏం బాబూ.... వచ్చావా? రాత్రి చానా సేపటి దాకా నిద్రపట్టినట్టులేదు. ఏ తెల్లారుజామునో పడుకొని ఉంటారని నిద్ర లేపనేదు.' అన్నాడు. తరువాత గట్టుమీదికి వచ్చి. 'ఇదిగో దీంతోటి పళ్లు తోంకొండి. కాస్త ఎంగిలి పడిదిరిగానీ' అని వేప్పుల్ల చేతికి అందించాడు. అప్పటికి నీటితీతకు కాల్వలు తీయటం పూర్తయింది. ఇంక - పడిపోయిన చేను నిలబెట్టాలి.

అప్పలనర్స ఒడ్డుమీదికి వచ్చి కాళ్ళు, చేతులు శుభ్రంగా కడుక్కుంది. మామిడి చెట్టు నీడలో ఉన్న తట్ట దగ్గరికెళ్లింది. దాన్లో పొద్దున్నే సిద్ధం చేసి తెచ్చిన పెరుగన్నం కేరేజీ ఉంది. అతడు కూడా శుభ్రంగా కాళ్లు చేతులు కడుక్కొని - పెద్ద అరిటాకు కోసుకొచ్చాడు. ఆమె దాన్లో వేడివేడి పెరుగన్నం వడ్డించింది.

ఆబగా తిన్నాడు రామనాథం.



చూడు బాబూ.... వాతావరనం ఇలా ఉంటే - సేనుకేమీ డోకానేదు. రేపు సాయంత్రానికల్లా నీరంతా పూర్తిగా అర్చేస్తాది. రేపు, ఎల్లుండి - ఆరనిచ్చి - అవతలి ఎల్లుండి కోత మొదలెట్టడమే ఇంక.' అని హుషారుగా చెప్పాడు అప్పలనాయుడు. తరువాత అప్పలనర్సకేసి చూసి, నవ్వుతూ - 'మీ తమ్ముడి పెల్లికి బెమ్మండంగా తాడేసుకొని దర్జాగా వెల్దువుగాని...' అన్నాడు.

పెరుగన్నం తిని, చేతులు కడుక్కున్నాక - 'నేను వెళ్తొస్తాను' అన్నాడు రామనాథం.

అప్పుడు ఆమె సేనుకేసి చూస్తూ అంది, 'మనిసి జెనమెత్తాక ఈ కట్టాలూ, నట్టాలూ తప్పవు బాబూ. కట్టాలున్న దగ్గరే సుకాలు.. సూడండి... నిన్నటికీ, ఇప్పటికీ ఎంత తేడానో....

ఆమె తమ గురించి చెబుతున్నా - తన కోసవే చెబుతున్నట్టుగా అనిపించింది. అవునన్నట్టుగా ప్రసన్నంగా తలూపాడు రామనాథం.

వస్తూ వస్తూ వంతెన దగ్గర కొండగెడ్డ వైపు చూశాడు.

అదింకా సుడులు తిరుగుతూ ఉధృతంగా ప్రవహిస్తూనే ఉంది. ఆ ఒడ్డు ఈ ఒడ్డూ ఒరుచుకొంటూ పారుతోంది. పక్కనున్న తుప్పల్లోంచి - పాము బారిన పడ్డ కప్ప ఒకటి దాన్నుంచి బయట పడాలని భీకరంగా అరుస్తోంది. ఆ శబ్దం ఎక్కడి నుంచి వస్తుందో చూసి అక్కడికి ఒక పెద్ద రాయి గురిచూసి విసిరాడు. ఏమో... దాని ధాటికి పాము పట్టు సడలిస్తుందేమో! అదే అదనుగా కప్ప ఎటువేపైనా దూకి ప్రాణాలతో బయటపడుతుందేమో! ఏ ప్రాణికైనా జీవించటం కన్నా అద్భుతమైన ఆనందం. ప్రియమైన వ్యాపకం ఏముంటాయి కనుకన!

**(నోముల సత్యనారాయణ కథా పురస్కారం-2011 పొందిన కథ)**



# ఇస్త్రీ

- డా॥ ఎన్. గోపి

చూస్తే మల్లమ్మ అగ్గిపుల్లలాగుంటది
అంత బరువైన ఇనుప పెట్టెను
అవలీలగా లేపుతుంది
లోపల
సూర్యుడు బంధించబడ్డట్టు
కిటికీల్లోంచి
బొగ్గుల సంధ్య తొంగిచూస్తుంది

మేకమూతిలాంటి ఆకృతిలో
ఒక్కొక్క ముడుతనే మేస్తూ
ముందుకూ వెనుకకూ తిరుగుతుంటుంది
**అతి పెద్ద బట్టల మూట**
**అరగంటలో** అదృశ్యం!

నైపుణ్యమంతా
మడతపెట్టడంలోనే వుంది
అతడెంత చచ్చుగా వుండేవాడో!
చలువ బట్టలేసుకుని
వెలిగిపోతున్నాడు

మల్లమ్మా!
మావాడు చెప్తే వింటలేదు
వాన్ని పంపిస్తా
ఓసారి ఇస్త్రీ చేసి ఇవ్వరాదూ!

అంతేకాదు
దేశమంతా ముడుతలు పడ్డది
వాతలు పెట్టి మరీ సరిదిద్దాలి
ఇస్త్రీ బల్లపైపరిచిన
పూల దుప్పటి మీద పడుకొని
కవిత్వం కలలు కనాలనిపిస్తుంది గాని
ఇవాళ
మల్లమ్మ ముఖమెందుకో
ఇస్త్రీ పెట్టెలాగ మండుతూంది
కారణం కనుక్కొని
చన్నీళ్ళు చిలకరిస్తే గాని
మనస్సు కుదుటపడదు

---

# ఉత్తరం

- ఎ.ఎ. నాగేంద్ర
సెల్ : 9949358301



ఉత్తరం
వచ్చిందంటే
అమ్మ నాన్నకు
భూమి కంపించినంత దడ
పేగు మెలితిప్పినంత వ్యధ
ఫీజు కోసం
డబ్బు కావాలనే
సారాంశంతో ఉత్తరం
రాత్రంతా
అమ్మకు నిద్రపట్టదు
నాన్నకు ఊపిరాడదు
కొడుకు చదువుకు
అంతరాయం కలగరాదని
కోడికూయకముందే
ఉలిక్కిపడి లేస్తుంది అమ్మ

మేఘాన్ని గాలి తరిమినట్టు
నాన్నను
అమ్మ తరుముతుంది
అప్పుకోసం
నాన్న ఎడారిలో
ఒయాసిసు కోసం
జీరంగి పిట్టలా తిరుగుతాడు
ఎండమావిని
తలపించే రీతిలో

ఆసాములు కనిపిస్తారు
తీరా దగ్గరకు పోయి
అప్పు అడిగితే
ముద్దాయిని
వాయిదాలకు
తిప్పినట్లు తిప్పుతారు
అలసి నాన్న
ఇంటికొస్తే
అమ్మ
తూటా పేలుస్తుంది
డబ్బు తెచ్చావా? అని
నాన్న
మళ్ళీ ఆసామి చుట్టు తిరగడానికి
రెక్కలు తెగిన
జీరంగిలా ఎగిరిపోతాడు

---



# ఊహ

- ఎస్.ఆర్. భల్లం
సెల్ : 98854 42642

రెక్కలు చాపుకొని
ఎక్కడెక్కడో ఊహ ఎగురుతోంది
ఇప్పుడిక నీ తలపుల్లో చోటు దొరకవచ్చు
నీకు తెలియకుండానే
నాకు కానుకలు ఇస్తూనే వుంటావు
ఇంకా నా దోసిట్లో చోటు మిగిలే వుంది
కళ్ళ కదలికలతో
మళ్ళీ ఆశల కోశాలు నింపుతూనే వుంటావు
లెక్కలకు చిక్కని
మధురూహలు బహుమతులుగా
యిస్తూనే వుంటావు

అపుడపుడూ
నిట్టూర్పుల వేసవిలో వెన్నెల్లా
పాడమని ప్రాధేయపడుతుంటావు
మాటల్ని పాటలుగా
పాడటానికి ప్రయత్నిస్తుంటాను
పాట పాటగా లేకుండా పోతుంది

నాతో నువ్వు మాటాడకపోతే
మౌనంలోనే ప్రాణం పోయేట్లవుతుంది
నువ్వు నడిచే నేలలో
నింగీ నీరూ నిప్పూ నేనూ
ఒత్తిగిలి పరుస్తున్నట్లు ఎంతో మెలకువ
అడుగుల చప్పుడు కూడా
వినిపించని ఏకాంతంలో
ఏదో వింత అనుభూతి దోబూచులాడ్తుంది
ప్రాచీన ప్రేమను
పల్లకీలో ఊరేగిస్తున్నట్లు
ఎపుడూ ప్రవహించే ప్రణయ ప్రవాహాలమైతే
ఎంత బాగుండును...!?!

# ఎగుడు దిగుళ్ళ గుట్టు విప్పిన కుటుంబరావు

**- వేలూరి రామారావు**


కొడవటిగంటి కుటుంబరావు

"మన ఆస్తిపాస్తుల గురించీ, ఆచార వ్యవహారాలను గురించీ ఉన్నంత స్పష్టమైన అభిప్రాయాలు మన సంస్కారం గురించీ, నాగరికతను గురించీ సంఘానికుండవు.

- "తల్లిలేని పిల్ల"

స్త్రీల మీద విపరీతమైన దాడులు, వివాహ వ్యవస్థ కూలిపోతోందేమోనన్న భయాలు వీటి మధ్యనే మన ప్రతిరోజూ గడుస్తోంది. కోట్లకు పడగెత్తిన సినిమా తారలూ, కోటీశ్వరుల వారసులూ కూడా వీటికి మినహాయింపు కావడం లేదు. "యత్రనార్యస్తు"... "కల కంఠికంట...." అని చెప్పుకున్న ఈ నేలలో ఈ ఘోరాలేమిటి? మనుషుల సంస్కారం ఎందుకింతగా దిగజారిపోతున్నది? నాగరికత ఎందుకిలా వెర్రితలలు వేస్తున్నది? అనేది పెద్ద ఆవేదనగా మిగుల్తుంది. ఈ ప్రశ్నలకి డెబ్బై ఏళ్ళ కిందటే సమాధానం వెతికిన రచయిత కొడవటిగంటి కుటుంబరావు. నాలుగువందల దాకా వున్న ఆయన కథల్లో ఒక చిన్నది "చెడిన పెళ్ళి" చూద్దాం. పెద్దగా ప్రచారం జరగని కథ.

బాల్య వివాహం సందర్భంలో చెడిన పెళ్ళిని పెద్దయ్యాక సరిదిద్దుకుందామని ప్రయత్నం చేసి విఫలమైన ఒక యువకుడి కథ యిది. క్లుప్తంగా కథ ఇంతే. కథలో అవమానానికి లేదా వేదనకి లోనైన స్త్రీ శారద. చివర్లో నారాయణమూర్తిని కాదు పొమ్మని తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్నట్టనిపిస్తుంది. ఇక్కడ ఒక ప్రశ్నకి సమాధానం మనం వెతకాలి. వ్యక్తుల సంస్కారం, వ్యక్తిత్వం, నాగరికతా వగైరాలు వ్యక్తిగతమైనవా? పుట్టుకతో వస్తాయా? వాటిల్లో సంఘ శక్తుల ప్రమేయం ఏమిటి అన్నది. ఈ కథ రచనా కాలం 1948. కథా కాలం 1935 ప్రాంతం. కథలో "అవి శారద చట్టం వచ్చిన రోజులు" అని వున్నది. స్త్రీలు చేసిన మొట్టమొదటిగా చెప్పబడుతున్న పోరాటం ఫలితంగా వచ్చిన చట్టం, బాల్యవివాహ నిషేధ చట్టం. దాన్నే శారదా చట్టం అంటారు. అప్పటికి దేశం వలసపాలనలో వున్నది. గ్రామాల్లో వున్నది. ప్రజల ప్రధాన జీవనోపాధి ప్రధానంగా వ్యవసాయం. అంటే భూమి, ఆ భూమి జమీందార్ల, సుల్తాన్‌ల, రాజుల చేతుల్లో వుంది. వాళ్ళు యజమానులు గ్రామాల్లో వాళ్ళు అనుయాయుల్ని వుంచి వాళ్లకి భూమి మీద కొన్ని హక్కులిచ్చి పరిపాలించేవాళ్ళు. ఈ అనుయాయుల్ని హక్కుదార్లు, ఆసాములు అన్నారు. వాస్తవంగా భూమిమీద చెమటోడ్చి, ఆసాముల గాదెలు నింపేవాళ్ళు కూలీలు. హక్కులేమీ లేనివాళ్ళు, జీవనోపాధికి వాళ్ళకి వేరే మార్గం లేదు. అందుకే వాళ్ళు బానిసలయ్యేరు. భూమిమీద హక్కుతో పాటు వారసత్వాలు వచ్చాయి. నా భూమి అనేసరికి నా వారసులు అనేది వచ్చింది. నా వారసులు అనే సరికి నా కుటుంబం కావల్సి వచ్చింది. నా కుటుంబం కావాలంటే ఒక బలమైన వివాహ వ్యవస్థ అవసరమైంది. బలపడింది. ఇలా కుటుంబ వ్యవస్థా, వివాహ వ్యవస్థా బలపడేసరికి, కుటుంబాల్లో కూడా భూమి మీద ఆస్తి మీద ఏ హక్కులు లేకుండా చాకిరీ చేసి కుటుంబ యాజమానుల బొజ్జలు నింపే స్త్రీలు బానిసలయ్యేరు. స్వేచ్ఛకి దూరమయ్యేరు.

భూమిమీద హక్కులు లేని కేవలం కూలీలుగా బానిసలుగా వున్న శ్రేణులలో వివాహ వ్యవస్థా, కుటుంబ సంస్కృతీ బలహీనంగా వుండడం చరిత్ర. స్వేచ్ఛాపూరిత వివాహేతర సంబంధాలూ, మారు మనువులూ మనం చూడొచ్చు. కథలో నారాయణమూర్తి తండ్రి అటువంటి భూస్వామ్య సంబంధాల్లో వున్నవాడు. గ్రామంలో వున్నవాడు, భూమికి యజమానిగా వున్నవాడు. కథలో వాక్యాలు "సంపాదన లేకపోతే అతనికి జరగదని కాదు" "మారు మూల పల్లెటూర్లో" అనేవి వున్నాయి. అందుకే ఆయనా వైవాహిక వ్యవస్థనే, కుటుంబ వ్యవస్థనీ, వారసత్వ వ్యవస్థనీ వీటన్నింటికీ అవసరమైన బాల్య వివాహాల్ని కోరుకున్నాడు. శారదా బిల్లుని వ్యతిరేకించాడు. అది అత్యంత సహజం. అందుకే ఆయన "దుడ దుడ సంబంధం నిశ్చయించాడు. వారం రోజుల వ్యవధిలో ముహోర్తం పెట్టించేడు" సహజంగానే ఆయన సంస్కారం రజస్వలానంతర వివాహాల్ని వ్యతిరేకించింది. కులాన్ని బలపర్చింది. కుటుంబ వ్యవస్థ సాగదీతే కులం. ఇలా కథలో జీవనోపాధి సంబంధాలకీ సంస్కారాన్నికీ వున్న లంకె స్పష్టమైంది. అదే వయస్సున్న నారాయణమూర్తి మామగారు పట్టణవాసి. పట్టణాల్లో జీవితాన్ని చక్రం తిప్పుతున్నది వ్యాపారం. వృత్తి విద్య, అనువంశిక విద్య, అనుభవ విద్యల స్థానంలో వ్యాపారం తన అవసరాల కోసం అక్షర విద్యని

అందరూ సమానంగా వుండాలన్న సంస్కారం. వ్యవసాయం నుంచీ వ్యాపారం నుంచీ వేరైన సంస్కారం. ఒకరి నొకరు దోచుకోని సంస్కారం. ఇలా ఈ కథ ద్వారా మనుషుల సంస్కారమూ, నాగరికతా వ్యక్తిగతాలో, పూర్వజన్మ సుకృతాలో కావనీ, మనుషులు తమ పొట్ట తాము పోసుకునే క్రమంలో ఏర్పడే విషయాలని మనకి అర్థం చేయిస్తారు. వాటి వెనుక వన్న ఆర్థిక చక్రం, ఏలినవారు ఏర్పరచిన సూత్రాలూ స్పష్టం చేస్తారు.

ప్రవేశపెట్టింది. వాస్తవానికి విద్య అంటే శ్రమా, నైపుణ్యమూనూ. పనీ, పనితనమునూ, దాని స్థానంలో "చదువు" ని ప్రవేశపెట్టింది. విద్య ద్వారా ఉపాధి దొరికింది. చదువు ద్వారా వుద్యోగాలేర్పాటు చేసింది. పల్లెల్లో వృత్తులున్నాయి. పట్టణాల్లో వుద్యోగాలున్నాయి. వ్యవసాయంలో వనివాళ్ళని ''కూలీలు'' అంటే వ్యాపారంలో వనివాళ్ళని "వుద్యోగు"లన్నారు. అయితే కూలీలకి, బానిసలకి మరో దిక్కు లేక స్వేచ్ఛ లేదు. ఉద్యోగులు నచ్చని పని లేదా గిట్టని పని మానేసి మరో దాన్లోకి పోవచ్చు. కొంత స్వేచ్ఛ వుంటుంది. కుటుంబాలకీ ఇది వర్తిస్తుంది. స్త్రీలు బానిసలుగానే వున్నా కొంత చదువుకొనే స్వేచ్ఛా, కొంత నోరు విప్పే స్వేచ్ఛా వస్తాయి. చాలా కొద్దిమేరకైనా కుటుంబ, వివాహ వ్యవస్థలు బలహీనపడతాయి. భూమి, ఫలసాయం, ఆదాయం పల్లెల్లో వున్నాయి. పెట్టుబడి, లాభం పట్టణాల్లో వున్నాయి. ఈ సంస్కారంలో వున్నవాడు నారాయణ మూర్తి మామగారు. శారద తండ్రి. ఆ సంస్కారం భూస్వామ్య సంస్కృతిని వ్యతిరేకించింది. నాగరికమైంది. తమని కట్టిపడేసే భూస్వాముల కంటే కొంత స్వేచ్ఛ నిచ్చిన వ్యాపారస్థుడు సంస్కర్తగానే, గొప్పగానే కనిపిస్తాడు. కూలీలకి అందుకే శారద తండ్రి "పెద్ద సంఘ సంస్కర్త అని ఖ్యాతి గలవాడు" అయ్యాడు. గ్రామీణ సంస్కారం మీద నిరసన చూపించాడు. వియ్యంకుడితో విభేదించి కూతురి భవిష్యత్తుని కూడా లెక్క చెయ్యని సంస్కారం ప్రదర్శించాడు. పెట్టుబడికి కట్టుబడి వుండదు. లాభం చూసుకొని తెగదెంపులు చేసుకుంటుంది. పాత వ్యాపారంతోనైనా పాత సంబంధాల్తోనైనా. నారాయణమూర్తి పట్నంలో పెరిగినవాడు. చదువు జీవనోపాధిగా చేసుకున్నవాడు. తన పొట్టపోసుకోడానికి కావలసిన పని లేదా చదువు నేర్చుకున్నవాడు. వ్యవసాయ సంస్కృతిని వ్యతిరేకించి తండ్రి చేసిన "మరో పెళ్ళి ప్రయత్నం పడగొట్టాడు". వివాహ వ్యవస్థ స్థానంలో వివాహబంధానికి చోటిచ్చాడు. శారదకి తనను ఆమోదించే లేదా తిరస్కరించే అవకాశమిచ్చాడు. హిందూ వివాహ చట్టం కింద తన భార్య తనతో జీవించి తీరాలని నోటీసివ్వలేదు. శారద స్వేచ్ఛని గౌరవించాడు. ఆమె మీద వ్యవసాయ గ్రామీణ సంస్కృతి ప్రకారం పెద్ద మనుష్యుల ముందు, కుటుంబం ముందు పంచాయితీ పెట్టలేదు. శారద తనని గౌరవించేవాడిని ఎన్నుకోవాలని ఆకాంక్షించేడు. స్త్రీ పురుషుల మధ్య గౌరవము, నమ్మకము గల సంబంధాలుండాయని శారదతో స్పష్టంగా చెప్పాడు. సుభద్ర విషయంలో పాటించాడు. ఇది ఆచరణీయమైన సంస్కారం. అందరూ సమానంగా వుండాలన్న సంస్కారం. వ్యవసాయం నుంచీ వ్యాపారం నుంచీ వేరైన సంస్కారం. ఒకరి నొకరు దోచుకోని సంస్కారం. ఇలా ఈ కథ ద్వారా మనుషుల సంస్కారమూ, నాగరికతా వ్యక్తిగతాలో, పూర్వజన్మ సుకృతాలో కావనీ, మనుషులు తమ పొట్ట తాము పోసుకునే క్రమంలో ఏర్పడే విషయాలని మనకి అర్థం చేయిస్తారు. వాటి వెనుక వన్న ఆర్థిక చక్రం, ఏలినవారు ఏర్పరచిన సూత్రాలూ స్పష్టం చేస్తారు. అయితే మారి ఈ వ్యక్తిత్వాలు, సంస్కారాలు సాఫుగా, చక్కగా గీత గీసినట్లుగా వుంటాయా? సంస్కారాల్లో ఎగుడు దిగుళ్ళుంటాయా? అవకతవకలుంటాయా? అన్న ప్రశ్నలకీ సమాధానాలు ఈ కథలో మనకి దొరుకుతాయి. శారద తండ్రి వ్యాపార సంస్కారంతో కులాన్ని వ్యతిరేకించినా, గ్రామీణ, సంస్కృతితో రాజీపడకపోయినా ఇతని సంస్కారంలో ఎగుడు దిగుడుల్లో వున్నాయి.

"మీ నాన్న గొప్ప సంస్కారి కాదు. పదేళ్ళు దాటీ దాటకుండానే నీకెందుకు పెళ్ళి చేయవలసి వచ్చింది? మీ మేనేత్త ధన సహాయం పొందుతూ వుండటం వల్ల కాదా? మీ నాన్న మానాన్నతో ఆనాడు అంత పోట్లాట పోట్లాడింది?" అన్న నారాయణమూర్తి మాటల్తో సంస్కారాల్లో ఎగుడు దిగుళ్ళకి కారణాలు స్పష్టం అవుతాయి. వెంటనే మనకు గుర్తొచ్చే మరో పాత్ర శారద మేనత్త. ఈమె పునర్వివాహం చేసుకున్న స్త్రీ. నాగరిక సంస్కారం. వ్యాపార సంస్కారం. కూలీ తన పనిమానేసి మరో పని వెతుక్కోవచ్చునన్నది. అంతేకాదు. కులాంతర వివాహం చేసుకొన్నది. కులం వ్యవసాయానికి పెద్ద బలం. వ్యాపారానికి కులంతో పేచీ లేకపోయినా వ్యాపారానికి అడ్డం వస్తే ఒప్పుకోదు. గ్రామంలో సెట్టిగారైనా, పట్నంలో షావుకారైనా, తన సరుకు అందరికీ అమ్ముకోవాలి. తనకి లాభం ముఖ్యం. కులం కాదు. ఒక పురోగామి సంస్కారం ప్రదర్శించిన మేనత్త తన మేనకోడలి పెళ్ళి విషయంలో బాల్య వివాహానికి పట్టుబట్టింది. సాధించింది. ఇది అవకతవక. సంస్కారంలో ఎగుడుదిగుళ్ళు. గ్రామాలూ, పట్టణాలూ మధ్య రాకపోకలూ, ఇచ్చి పుచ్చుకోడాలూ వుండడం వల్ల పాత ప్రభావాల వాసన తొందరగా పోదు. శిథిలాలలోంచి సెగవస్తూనే వుంటుంది. ఒకే కాలంలో గ్రామాల్లో, పట్టణాల్లో వున్న బతుకు తెరువుల్లో వున్న అవకతవకల ఫలితమే ఇది. రెండింటికీ మూలం ఒకటే. భూమిమీద స్వామిత్వమూ, పెట్టుబడిమీద యజమాన్యమూ వుండటమూ, అవి రెండూ ఏక కాలంలో వుండటమూ.

ఇలా సంస్కారాల మధ్య, సంఘర్షణ గాని చాలా సులువైన పద్ధతిలో మన ముందుంచుతారు కుటుంబరావు గారు. మనకు కనిపించే మరో పాత్ర శారద. వ్యాపార సంస్కారంలో నగరంలో పెరిగిన రెండో తరం మనిషి. అందుకే ఆమె ఆ సంస్కారంతోనే వున్నది. వ్యాపారం పెరిగి పెరిగి ఎక్కడికి పోతుంది? సంతల్లో ఉల్లిపాయ లమ్ముకుని లాభాలు తీసి పెట్టుబడి పెరిగాక సహజంగానే పట్నంలో ఉల్లిపాయలు టోకు దుకాణం అక్కణ్ణించి నగరంలో మొత్తం సరుకుంతా కొని దాచి అమ్మి సరుకు మొత్తం మీద తన పెత్తనం సాగించే క్రమం సాగుతుంది. వ్యాపారంలో అత్యంత కీలకసూత్రం వ్యాపారంలో సెంటిమెంట్లు ఉండకూడదనేది. అప్ప చెల్లెలికి కూడా అప్పనంగా ఏదీ ఇవ్వరు. తనకి సరుకు సరఫరా చేసేవాడూ, తన దగ్గర సరుకు

కొనేవాడు ఎవరూ? ఎలాంటివాడు? అనేది అనవసరం. చవగ్గా కొని ఖరీదుగా అమ్మగలుగుతున్నామా లేదా? లాభం వచ్చిందా లేదా అన్నదే ముఖ్యం. అందుకే నీతులు, విలువలు అనేవి సెంటిమెంట్లు శారద ఆ రకం సంస్కారమే కలిగివున్నది. హారనాథ్ మాటల్లో "ఎవడితోనైనా సాహసం చేస్తుంది. వాడు లక్షాధికారులై వుండాలి. వాడు తనకు లక్షలు ఇవ్వాలి. తనమీద ఎటువంటి హక్కు చలాయించరాదు" వ్యాపారానికి, తనమీద ప్రభుత్వం పెత్తనం చెయ్యటమంటే అస్సలు పడదు. ప్రభుత్వం తనకి విరివిగా లైసెన్సులూ అవీ యిచ్చి తన లాభాలకి సాయం చెయ్యాలి. తనూ తన కుటుంబం జల్సాగా బతకాలి. ఆ సంస్కారంలో వున్న శారదకి వివాహబంధం కూడా సెంటిమెంటే'' పెళ్ళంటే బంధిఖానాయేనని అవిడ ఉద్దేశ్యం. ఆ సెంటిమెంటుని కాదని ఆమె "చాలా డబ్బు గలవాడు. బీచిలో పెద్ద మేడ కూడా వుంది. అతని మొదటి భార్య ఎవరితోనో లేచిపోయింది" అలాంటి వాడిని ఆమె ఎన్నుకున్నది.

ఒక ఆచరణీయమైన సంస్కారంతో వున్న నారాయణమూర్తి "ఒక పెళ్లాన్ని దక్కించుకోలేనివాడు" అని ఆమె వెళ్ళిపోవడం వెనక ఆమె పడిన పీడన, వేదనల్ని అర్థం చేసుకొనే ప్రయత్నం చేస్తే, శారద మాత్రం ఒక స్త్రీ అయి ఉండి ఆమె గురించి "లేచిపోయింది" అని అనగల్గింది. స్వలింగ ద్వేషం ఆమెని లోబరుచుకుంది. వ్యాపారం మాదిరి కొద్ది దేశభక్తి కూడా సెంటిమెంటుగా మిగిలిపోతుంది. మనదేశంలోకి వస్తున్న విదేశీ పెట్టుబడుల్లో పాకిస్తానీయుల డబ్బు లేకపోలేదు. ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్‌లలో పెట్టుబడులు పెట్టిన మన వ్యాపారస్థులూ వున్నారు. ఎంతో వ్యక్తిత్వం వున్న స్త్రీలా కనబడ్డ శారద సంస్కారంలో వున్న ఎగుడు దిగుళ్లకి కారణం మనకి స్పష్టమౌతుంది. పెళ్ళినాటికి తన భర్త తనలాగే నిస్సహాయుడు. నేటికి స్వతంత్రుడయ్యాడు. తప్పు తెలుసుకున్నాడు. "నీ విషయంలో ద్రోహం చేసింది నేను" అని ఒప్పుకున్నాడు. క్షమాపణ చెప్పుకుని పరిహారం చేస్తానన్నాడు. ఇంకే ఇతర సంబంధాల్లోనూ లేడు. ఇతర చెడులు లేవు. ఇంక శారదకి దేనికి అభ్యంతరం? విధేయత, నమ్మకం, గౌరవం, దేశభక్తి ల్లాంటి సెంటిమెంట్లు దాటిపోయిన లాభాపేక్ష వ్యాపార సంస్కృతి దీన్నే కాబోలు మనం ఇవాళ ప్రపంచీకరణ, సామ్రాజ్యవాదం అంటున్నాం.

శిల్పం విషయానికొస్తే, నారాయణమూర్తి తండ్రి మామల గురించి స్పష్టమైన నేపథ్యం, ఆ సంబంధాల గురించి కొండగుర్తులూ ఇచ్చిన రచయిత నారాయణమూర్తి సంస్కారం గురించి ఎందుకు ఇవ్వలేదు. తర్వాత మామగారిచే అమలులో వున్న సంబంధాలు నారాయణమూర్తికి రావలసిన సంబంధాలు. అలాగే శారద సంస్కారం ఆనాటికి రాబోతున్న ఒక ప్రమాదం. వెయ్యేళ్ళపాటు సాహిత్యం ద్వారా ఒక ప్రచారం సాగింది. వ్యక్తుల సంస్కారం, ప్రవర్తన, వగైరాలు వ్యక్తిగతమైనవనీ, జన్మతః వచ్చేవనీ, కులీనుడు, సజ్జనుడు లాంటి ప్రచారం రాజుల అవసరం. మనుషుల్ని మంచివాళ్లు, చెడ్డవాళ్లుగానూ లేదా దేవుళ్ళూ రాక్షసులుగానూ విడగొట్టి, మనవాళ్ళంతా అంటే మనరాజు గారి వైపుండే వాళ్ళంతా మంచివాళ్ళనీ, వ్యతిరేకులంతా దుర్మార్గులనీ, ఆ ప్రచారం సంఘంలో ఒక చట్రాన్ని పరిచింది. దీన్నంతటినీ పూర్వపరం చెయ్యడానికి నాయక – ప్రతినాయక ప్రతిమల పౌరాణిక పద్ధతి నుంచి పూర్తిగా వేరుపడి వాస్తవిక దృష్టితో రచనలు చేసిన కుటుంబరావు గారిని చదవడం ఒక గొప్ప అనుభవం మాత్రమే కాదు. జీవితాలకెంతో మార్గదర్శకం.

# హైకూలు



- బొబ్బిలి జోసెఫ్
సెల్ : 9989261991

వానతుంపర్లో
సంధ్యా కిరణాలు
ఇంద్రధనుస్సు

ముత్యాల జల్లు
పుడమికి సింగారం
పంట బంగారం

చిందులేస్తోంది
చిటపటలాడుతూ
వాన చినుకు

మబ్బులో నుండి
ఊడిపడింది
పిడుగురాయి

చంద్రుడు లేక
కనులు మూసుకుంది
కలువ కన్య

కోయిల కూత
ఎలమావి చివురు
వసంతకాలం

రివ్వున శబ్దం
తాండవ నృత్యహేల
గాలి దుమారం

అవిగో చూడు
నేలపై నక్షత్రాలు
మిణుగురులు

కొండకు చలి
దుప్పటి కప్పుకుంది
తెల్లమబ్బులు

అందాల వన్నె
పాలవంచ పసిడి
కిన్నెరసాని



# గజల్

- ద్వావరి నరేందర్‌రెడ్డి
సెల్ : 9848995597

భయం తొలగి మనసునందు - ఆనందము దూరుతుంది
అహం తరిగి బ్రతుకునందు - మకరందము ఊరుతుంది

సూటిపోటి నోటి మాట - మమతలనే తుంచివేయు
మాట మధురమైతే చెలిమి - పచ్చదనము తొడుగుతుంది

కాగితాలు చేతబూని - తిరుగుతుంటె ఏమి ఒరుగు
హృదయ పొరల మాటునుంచి - సాహిత్యము ఉబుకుతుంది

మాటతో పని ఏముంది - ప్రేమలొలికె చూపు చాలు
సఖియ చూపు తోడ సఖుని - హృది తాపము మీరుతుంది

అంతులేని ఆవేదన - జీవితాన్ని కుదిపివేస్తే
కలత చెంది గుండెలోన - రక్త భాష్పము కారుతుంది

అపజయమే అనుభవముగ - మలుచుకుంటే హాయిలే
తలపట్టుకు కూర్చుంటే - విశ్వాసము తరుగుతుంది

బ్రహ్మరాత ఇంతేయని - శోకించుట వలదంట
నమ్మకంతో సాగిపోతె - అదృష్టము చేరుతుంది

ప్రేమలేని ముద్దులన్ని - ఒట్టి మూతుల జుర్రుడే
ఓ నరేంద్ర! అంతరంగం - అనుబంధము కోరుతుంది



# హైకూలు

- సుపాణి
సెల్ : 394100531

కరువు
కాటేసింది
పల్లెనూ, ప్రజలనూ

ఉత్తర
చూడగానే
తత్తరపాటు.. వాన భయం

ఆమె వెళ్ళిపోయింది
ఆ.. సంభాషణల మాధుర్యమే
గదంతా ప్రతిధ్వనిస్తూ

జనాన్ని
భయభ్రాంతులను చేస్తూ
అకాల మృత్యువూ... అధాటు
వర్షం...

గవాక్షం దగ్గర
గడ్డిపోచలు చెదురు మదురుగా..
పిచ్చుక స్మృతి శకలాల్లా

ఉరుములో
మెరుపులో
ఊరంతటినీ భయపెడుతూ

తెరిపంటూ లేని
వాన చినుకులు
నేనూ - గొడుగు తడుస్తూ

ప్రేయసి
తనువంతా మెరుస్తూ
అర్ధచంద్రాకారాలు

పురావస్తు సంపదలా
స్మృతిపథంలో మెరుస్తూ
నాన్న కళ్ళజోడు

చీకటిని తరిమేస్తూ
చిరుదివ్వెలా
కొవ్వొత్తి వెలుగుతూ

వెలుగు రాకను
ఆహ్వానిస్తూ
బుడ్డిదీపం

చిల్లపెంకు
నిశ్చల ప్రవాహాన్ని
నిమ్నోన్నతాలుగా కదుపుతూ

# తెలుగు సాహిత్యం - బైండ్ల కుల సంస్కృతి

- డా॥ కొలకలూరి మధుజ్యోతి

ఆధునిక తెలుగు సాహిత్యంలో దళిత సాహిత్య స్థానం ప్రత్యేకమయినది. దానిలో మాదిగ సాహిత్య పాయ విశిష్టమయినది. దానిలోనికి తొంగి చూస్తే సాహిత్య విలువలకు సంస్కృతీ సౌరభాలు - లీలగా కొన్ని అశ్రిత కులాలు, ప్రగాఢంగా కొన్ని కులాలు అద్దుకొని కనిపిస్తుంది. లీలామాత్రంగా కనిపించే సంస్కృతీ విశేషాలలో బైండ్ల కులం ఒకటి. మాదిగల అశ్రిత కులం వారి శుభకార్యాలకు పూజారిత్వాన్ని నెరిపే కులంగా నిల్చే బైండ్ల కుల సంస్కృతి ఆ కోణంలోనే ప్రధానంగా సాహిత్యంలో ప్రదర్శితం అయింది.

బైండ్ల కులస్తులు మాదిగల పూజారులు. బైండ్ల / కొలుపుల వాండ్లు పూజారులు. ముత్యాలమ్మ, ఎల్లమ్మ, మహిషమ్మ దేవతలను పూజిస్తారు. 1956 Presidents Order లో వేరు వేరుగా పేర్కొన్నా "The field investigation reveals that the names correspond to one and the same section of the people. Bindla and Kolupulavandlu are also locally known as Pambala. It is found during the field study that all the scheduled caste people like Mala Madiga and Dakka call them as Bindla, other sections of Hindu Castes call them as Kolupulavandlu, while Muslims call these as Pambala - (Ethognapic notes P.No. 49).



పంబ వాయిద్యంతో కళాకారులు

పంబాల కులం ఆంధ్రలో బైండ్ల, కొలుపుల వాండ్లు తెలంగాణాలో కనిపించే జనాభా. ఈ మూడు కులాల సారూప్యత భగవత్ / దేవతారాధన. కొద్ది తేడాతో వారి అస్తిత్వాలు ఉన్నాయి. దేవతల కొలుపుల కారణంగా కొలుపుల వాండ్లు, పంబాల అనే సంగీత వాయిద్యం పేరిట పంబాడ కులం పేరు వచ్చింది. వీరు జాతర్ల సమయంలో ఎంకమ్మ కథ చెప్తూ, పంబాలను వాయిస్తారు. కొలుపుల వాండ్లు అంటువ్యాధులు వ్యాపించినపుడు ముత్యాలమ్మ, ఎల్లమ్మ, మహిషమ్మలనే దేవత ఆవాహన చేసి తృప్తిపరుస్తారు. బైండ్లను బవనీలు అనీ అంటారు. బవనీలు కొలుపుల వాండ్లు, పంబాల వారు ఒకటే అని పేర్కొన్నా కులరీత్యా వారికి ప్రత్యేక గుర్తింపు ఉంది. వారి గుర్తింపులోనూ ఈ కులం ఏర్పడటానికి వెనుక ఒక కథ చెప్పుకుంటారు.. అది పరశురాముడితో ముడిపడి వుంది.

కృతయుగంలో పేరుగాంచిన ఋషి జమదగ్ని. అతనికి భార్య రేణుకాదేవికి ఒకసారి గొడవ జరిగింది. కోపంతో జమదగ్ని తల్లిని చంపమని పరశురాముడికి చెప్పాడు. పరశురాముడు దానిని ఆచరించాడు. తల్లి ఆత్మ వెళ్ళి దగ్గరలో ఉన్న మాదిగపల్లెలోని తోళ్ళను పరిశుభ్రపరుస్తున్న పాత్రలో దాక్కొంది. ఆవేశంలో తనిచ్చిన ఆజ్ఞకు జమదగ్ని బాధపడ్డాడు. దానిని పాటించిన కుమారుడిని చంపుటకు పాప పరిహారం అనుకొన్నాడు. చంపబోతే పరశురాముడు పారిపోయాడు. దారిలో ఒక రాక్షసి ఎదురైతే దానిని చంపి దాని వెన్నెముకతో 'జమడిక' అనే వాయిద్యాన్ని రూపొందించాడు. "The Tharae is conical in shape, narrow above and rounded at the side, The skin covering the heart was used to enclose the broad side of the 'Jamdika'. The packed nerve fixed at the center of the skin and taken inside the instrument was tied to the front bone of the right hand, which was used to produce appropriate sound. The teeth of the devil were used to decorate the Jamdika at wider edge by

arranging them in two rows" Ethnographic Notes .

ఈ విధంగా తయారు చేసిన వాయిద్యంతో తల్లిని కీర్తిస్తూ సాగాడు. అతను, తల్లి ఆత్మ విశ్రమిస్తున్న గ్రామం చేరగానే తల్లి లేచి బిడ్డ ముందుకు వచ్చింది. తల్లిని కనిపెట్టనని అరచేతిలో రాసి పైకి లేపాడు. ఆ చేతి నీడ తలకిందులుగా (శీర్షాసనంలో) ఉన్న జమదగ్ని మొఖంపై పడింది. క్రుద్ధుడైన జమదగ్ని కళ్ళు తెరిచాడు. ఆ కోపానికి పరశురాముడి తల తెగిపడింది. తల్లి కోపించి ఎల్లప్పుడూ దేవతను కీర్తిస్తూ, పాడుతూ వారిని తృప్తిపరచమని శపించింది. అలా దేవతలను కీర్తించే పరశురాముడి వంశీయులే కొలుపువాండ్లు.

"సాక్షాత్తూ శివుడే బవనీని వేషం వేసుకొని ఎల్లమ్మ పుట్ట దగ్గరికి వచ్చి జమిడికను తీసుకొని వాయించి ఎల్లమ్మను కీర్తిస్తే ఆమె పుట్ట నుండి బయటకి వస్తుంది. ఇలా మొదట బవనీని వేషం వేసుకొన్న శివుడే బవనీల కులం మూలపురుషుడు అయ్యాడని గౌతు పురాణం (బవనీలు లేక బైండ్ల కథ) చెబుతుంది." (తెలుగులో కుల పురాణాలు ఆశ్రిత వ్యవస్థ, పులికొండ సుబ్బాచారి పు. 109). ఇలా భిన్న కథనాలతో బైండ్ల బవనీల గొప్పదనం, పవిత్రత ప్రకటింపబడ్డాయి.

సాహిత్యంలో బైండ్ల కులజులు, కథలో అంతర్లీనంగా కనిపిస్తారు. కుల సంస్కృతీ సంబంధ కథగా కంటే వెతికి పట్టుకోగలిగేటట్టు ఉంటుంది ఈ కథ. గోగు శ్యామల 'బైండ్లామె భూమడు గదా మరి!' (నల్లరేగడిసాల్లు) బసివిని భూసమస్య ఇతివృత్తంతో సాగిన కథ. అందులో భాగంగా వారికి సంబంధించిన అంశాలు దొరుకుతాయి. ఊరిలో ఉరడమ్మ ఉత్సవం జరిపించాలని నరేందర్‌రెడ్డి బైండ్లోళ్ళని వారి పాలోళ్ళని పిలిచి వివరించాడు. అంటే, బైండ్లోళ్ళూ, ఊరి పండగలలో భాగమవుతారు.



జమడిక వాయిద్యం

బైండ్ల సాయమ్మ పండగకు ఏర్పులమ్మ, ఆమెను కట్నం నిర్ణయించమని అడగటం ద్వారా ఆమెకు కొంత ధనమిచ్చి ఆ శుభకార్యం జరిపిస్తారన్నది స్పష్టం అవుతుంది. కాని ఈ కథలో ఆమె బసివి. బసివిగా రంగం ఎక్కాలి. గుండె డప్పుల కనకయ్య రాసిన 'మహావీరులు' (మేమిట్లుండం) కథలో బైండ్లాయన, మాదిగల పెళ్ళిళ్ళు చేసే పెద్ద. 'డప్పుల చప్పుళ్ళ మధ్య ఆయన వేషధారణ ఇంట్లో చేసుకుంటున్నాడు. మంత్రాలు చదువుతూ ఇంటి బయటకి వచ్చాడు. "ఎల్లమ్మ ముందరేసుకున్న పట్నం తొక్కుతూ కాసేపు జోగినిలా దేవున్ని - సెప్పిండు.

**గుండె డప్పుల కనకయ్య రాసిన 'మహావీరులు' (మేమిట్లుండం) కథలో బైండ్లాయన, మాదిగల పెళ్ళిళ్ళు చేసే పెద్ద. 'డప్పుల చప్పుళ్ళ మధ్య ఆయన వేషధారణ ఇంట్లో చేసుకుంటున్నాడు. మంత్రాలు చదువుతూ ఇంటి బయటకి వచ్చాడు. "ఎల్లమ్మ ముందరేసుకున్న పట్నం తొక్కుతూ కాసేపు జోగినిలా దేవున్ని - సెప్పిండు.**

రెండు నిమ్మకాయలు తీసి తన నడుముకున్న కత్తితో కోసి అటు ఇటూ పిండుతూ నాలుగు దిక్కుల నాలుగు పక్కలేసిండు. గడగడమని మంత్రాలు చదువుతూ పెండ్లి పిల్లగాని దగ్గరకెల్లి, పెండ్లి పిల్లగాన్ని నిలబెట్టి, అగ్గితో జిష్ట తీసి ఏదో కొన్ని మంత్రాలు చదివాడు. ఈ మంత్రాలకు తోడు డప్పుల మోత. చుట్టూ ఉత్సాహం. బైండ్ల వ్యక్తి మంత్రాలు చదువుతుంటే ఒక పెద్ద మనిషి బోనాన్ని ఎత్తుకొన్నాడు. ఎల్లమ్మ గుడి దగ్గర నుంచి ఈలలు చప్పట్లు పరుగులతో జోరుగా సాగుతున్నారు. బైండ్ల వ్యక్తి మంత్రాలు చదువుతూ సాగి, మళ్ళీ వెనక్కి వచ్చి పెళ్ళి కొడుకు చేతిలో చేయి వేసి మళ్ళీ ముందుకు సాగుతున్నాడు. అతని వెనుక బోనం, ఆ వెనుక పెళ్ళి కొడుకు ఆ వెనుక గూడెం ప్రజలు సాగుతున్నారు. "బైండ్లోడు బోనానికి ఏ శక్తులు అడ్డం రాకుండా మంత్రాలు చదువుతూనే బాణాన్ని మాటిమాటికి ఎక్కుపెడుతున్నారు. మాదిగ వారికి ఇది ఆశ్చర్యంగా ఉంది. ఇది అంతా, బైండ్లవారి ప్రాధాన్యాన్ని చెప్తుంది. మాదిగ వివాహాలలో బైండ్ల వ్యక్తి నిరాటంకంగా సాగటానికి దుష్టశక్తులను దరిచేరనీయకుండా రక్షణ కల్పించడానికి మంత్రాలను చదువుతాడు. మాదిగలు అతనికి ఇచ్చే ప్రాధాన్యం, వారు మాదిగలకు చేసే సేవ స్పష్టం అవుతుంది.

ఇలా సాగుతూ ఉన్నట్లుండి బోనం ముందుకు పోలేకపోయింది. బైండ్ల వ్యక్తి ఏ శక్తి అడ్డురాకుండా మంత్రాలు చదువుతున్నా ఆగిపోయింది. సమ్మక్క సారక్క దేవతలు బోనాన్ని ఆపినాయి. వాటి దగ్గర రెండు కొబ్బరి కాయలు కొట్టి మంత్రాలు చదివాడు. అయినా కదల్లేదు. "బైండ్లోని మంత్రాలు పారకపోయేసరికి కండ్లప్పగించి చూసి ఇంకా గట్టిగా మంత్రాలు చదువుతూ కుప్పిగంతు లేస్తున్నాడు" , సమ్మక్క - సారక్కల రక్తం

కోరుతున్నారని గ్రహించాక బైండ్ల వ్యక్తికి కోడిపుంజును అందించారు. కుడిచేత్తో కోడిని అదిమాడు. అది కిందపడి కొట్టుకుంటూ ఉందే. అప్పుడు బోనం కదిలింది. ఈ ఘట్టం అంతా వారి విశ్వాసాన్ని దానికి పాటించే ఆచారాన్ని పట్టిస్తున్నాయి. బైండ్ల వృత్తే దేవతారాధన. వారిని శాంతింపచేయడం, ఆ పని పెళ్ళి సంబరంలో భాగంగా నిర్వర్తించాడు బైండ్ల వ్యక్తి. పెళ్ళిలో బైండ్ల వ్యక్తి గోత్రాలు, మంత్రాలు చదవాలి. దానినే "కక్క (వేముల ఎల్లయ్య) నవలలో ఇలా చెప్పాడు. కక్కని పెళ్ళికి 'బైండ్లాయినె గోత్రాలు జదివి లగ్గం వొద్దగొట్టిండు" ఇలా బైండ్ల ప్రాధాన్యం ఇతివృత్తంలో కలసిపోయింది. "పొద" (కదిరె కృష్ణ) నవలలోనూ పెండ్లి సందర్భంలో బైండ్ల వ్యక్తి ప్రస్తావన ఉంది" బైండ్లాయ్న వచ్చిందు కంకణాలు గట్టిండు." ఆపై పెళ్ళిపనులు మొదలు అయ్యాయి. ఒకరికొకరు కంకణాలు కట్టుకోవడం బట్టలు కుంకుమ బొట్లు పెట్టుకోవడం జరుగుతాయి. బైండ్ల ఈ ప్రాధాన్యమే "మాదిగ వారి అశ్రితులలో కొందరు అశ్రితులు (సంగడి, బైండ్ల) దాతల కన్నా అధికులుగా భావిస్తారు" (తెలుగులో కుల పురాణాలు - అశ్రిత కుల వ్యవస్థ పు : 61) అనే సుబ్బాచారి పరిశీలనకు కారణం అయి వుంటుంది.

**ఎవరి జీవితాలను వారే అనుభవిస్తున్నారు కాబట్టి, 'ఎవరి జీవితాలను వారే ఆవిష్కరించుకోవాలంటున్నది ఆధునికా నంతరం వాదం' అని ఎస్వీ సత్యనారాయణ 'ఆధునిక కవిత్వం దళిత వాదం' (దృక్పథాలు పు. 125) పేర్కొన్నారు. పై వ్యాఖ్య ఒక అవసరాన్ని చెబుతోంది. దళితేతరులు దళిత స్వరాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించలేనట్టే, దళితులలోని ఒక కులపు జీవిత లోతులను మరో కులపు దళితులూ సంపూర్ణంగా ఆవిష్కరించలేరు. సాహిత్యంలో అనేక కులాల జీవితం, అనేక దళిత కులాల సంస్కృతి అనావిష్కృతంగానే ఉంది.**

పంబాల నరసయ్య ప్రస్తావన సాహిత్యంలో ఉంది. ఇతను చంకలో జంబులట్నం పట్టుకొని, పక్కన వంతలతో ఎల్లమ్మ కతను చెప్తున్నాడు. జమడిక వీరి సంగీత వాయిద్యం. ఎగిరెగిరి చెప్తూ నరసయ్య అలసి పోతున్నాడు. కథకుడు మధ్యలో ఉండి కథాగానం చేస్తుంటే పక్కన వంతలు జమిడికల్ని వాయిస్తూ ఉంటారు. జమిడిక పరశురామ (జానపద) కథలో పేర్కొన్న దానికంటే భిన్నమయినది. దీన్ని ఇత్తడితోనూ, కర్రతోనూ చేయించుకొంటారు. "బైండ్లవారి కథల బాణీలకూ, జముకల కథల బాణీకీ చాలా వ్యత్యాసముంటుంది. బైండ్లవారు తెలంగాణాలలో ప్రాముఖ్యం వహిస్తే జముకుల వారు తూర్పుగోదావరి, విజయనగరం, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో ప్రాముఖ్యం వహిస్తున్నారు." (జానపద కళారూపాలు, డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి పు. 594, 595) ఇలా ప్రాంత వైవిధ్యం ఉంది. పంబాల నరసయ్య కథ సగంలోకి రాగానే ఆపి గొర్రెపోతును బలిచ్చాడు. గొర్రె పోతు గుండె, నాణెం, కార్జం, ఉలవలు తీసి వండి బోనం చేయమన్నాడు. గొర్రెపోతు పక్కకు తీసుకుపోయారు. మళ్ళీ కథ మొదలయింది. కథ అయ్యేసరికి బోనం అయిపోవాలనీ తొందరగా కోశారు. కథ ముగిసే సరికి బోనం ఎల్లమ్మ ముందరేసిన పట్నాల మీదకు వచ్చింది. ఈ బోనాన్ని తీసుకొనే బైండ్ల వ్యక్తి వెనక పెళ్ళి కొడుకుతో సాగారు. అలసిన పంబాల నర్సయ్య, బోనంతో సాగుతూ మంత్రాలు చదువుతూ ఉన్న బైండ్ల వ్యక్తి అలసినప్పుడు "కొడిక్కితోడు వచ్చి బోనం చుట్టూ ఎగురుతూ తనకు వచ్చిన మంత్రాలు చదవడం మొదలుపెట్టాడు" ఈ సందర్భంలో పంబాల వ్యక్తి ఎల్లమ్మ కథను శుభ సమయంలో చెప్తాడని తెలుస్తుంది. కథ మధ్యలో బలి ఇచ్చే ఆచారం కనిపిస్తుంది. ఆ బలిపోతు అవయవాలతో బోనం చేసి దేవతల దగ్గరకు తీసుకెళ్తారు, ఒక వివాహ ఉత్సవ వివరం ఈ కథలో తెలుస్తుంది.

ఎల్లమ్మ కథ చెప్తూ ఆడుతూ బలి ఇచ్చి కథ కొనసాగిస్తూ అలసిన సందర్భంలో పంబాలగా, పంబాల నర్సయ్యగా పేర్కొన్నాడు రచయిత. మంత్రాలు చదువుతూ శాంతి చేస్తూ బోనాన్ని ఊరేగింపుగా తీసుకెళ్తున్న వ్యక్తి బైండ్ల వ్యక్తి. ఈ ఇద్దరు తండ్రీ బిడ్డలు. కాని నిర్వర్తించిన పనులను బట్టి పంబాల బైండ్ల అని ప్రస్తావించినట్టు ఉంది. కథ చెప్పే వ్యక్తిని పంబాల వ్యక్తిగా మంత్రాలు చదివే వ్యక్తిని బైండ్లగా గుర్తించడం ఆనవాయితీగా ఉండి ఉండాలి. "తెలంగాణా జానపద కళా రూపాలలో శైవమతాన్ని ప్రబోధించేవీ, శక్తి స్వరూపాన్ని ఆరాధించేవీ, గ్రామ దేవతలని పూజించేవి ఎన్నో వున్నాయి. ఇలా కథలు చెప్పే వారిలో బవనీలనీ బైనీడి వారనీ, బైండ్ల వారనీ రకరకాల పేర్లతో పిలుస్తూ వుంటారు. ఈ బైండ్ల వారు హరిజనులైన పూజారులు" (జానపద కళారూపాలు, డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, పు. 593) అధ్యయనాలు ఈ రెండూ ఒక్కటే. పేరు మాత్రమే వేరు అని చెప్తున్నా, వారి పనులలో ఒక స్పష్టమైన పరిధి ఉన్నట్టు ఈ కథను బట్టి స్పష్టం అవుతుంది.

అలాగే పంబాల వాయిద్యానికి జమడిక వాయిద్యానికి కూడా తేడా వుంది. ఈ చిత్రాలు దానికి నిదర్శనం.

బైండ్ల కుల ప్రస్తావన ఇతర కథా వస్తుగతంగా వచ్చింది. మాదిగ జీవితంలో బైండ్ల కున్న ప్రాధాన్యం ఒక 'మహావీరులు' కథలో తొంగిచూసింది. అది బైండ్ల జీవిత సంస్కృతిని ఒక శాతం అందించింది. మరింత జీవితం వారి పక్షం నుంచి తెలియటం లేదు. వృత్తిపరంగా బైండ్ల మంత్ర తంత్రాల పాత్ర ఎలా వున్నా మనుషులుగా వారి జీవితాల చిత్రణ జరగాల్సే వుంది.

# కాలం మింగేసిన ఆయుధం

- పాతూరి అన్నపూర్ణ
సెల్ : 9490230939



తడి ఇంకిపోయిన కవిత్వం
పచ్చదనం కోల్పోయిన చెట్టులా
ఇక్కడన్నీ రాళ్ళే కనబడుతున్నాయి
అన్నీ జలధారలు కోల్పోయిన బండశిలలు
ఎప్పుడో నేరేడు చెట్టు కింద
ఆరేసుకున్న బాల్యం జాడలు
కాకెంగిలి పంచుకుని తినిన అనుభూతులు
వెన్నెల రాత్రులలో నేస్తాలతో
ఇసుక కుప్పల గుజ్జెన గూళ్ళు కట్టడం
ఇప్పటికీ మర్చిపోని తీపిగుర్తులు
బాల్యం యవ్వనంలోకి అడుగుపెట్టగానే
కవిత్వం ఉద్భవించింది చెట్టుకి వేసిన చిగురులా
రాసినదంతా పచ్చదనాన్ని అద్దుకునేది
ఆర్ద్రత నింపుకున్న అక్షరాలు ద్రవించేవి
నేల, నీరు, గాలి అన్నీ నావే అనిపించేవి
ఎప్పుడైనా ఓ పక్షి నా అక్షర భూమిపైన వాలి
కవిత్వపు గింజలను ఏరుకొని ఎగిరిపోయేది
మళ్ళీ ఆ ఊట బావిలో నీళ్ళ కోసం
కాగితపు పడవలు వేసి తోడుకోవడం
అప్పుడు రాసినదంతా యదార్థం
దాపరికాలు లేని దగ్గరితనపు మాటలు
కవిత్వం నాకూ, సమాజానికీ ఒక వారధి
ప్రశంసల వర్షం ముంచెత్తేది
యోచనాత్మక సూచనలు కదిలించేవి
ఇప్పుడూ రాస్తున్నాను రాయడం వదలలేక
నాకోసం నేను రాసుకుంటున్నాను
రాత్రి పూట సంపెగల వాసనలు తాకడం లేదు
వానలో తడిసిన మట్టిగంధం దొరకడం లేదు
ప్రపంచం అంటూ ఆధునిక ఆవరణాన్ని చుట్టుకుంది
నా లోకమూ ఆ తానులో ముక్కే
మెదడులో ప్రక్షాళన జరగడం లేదు
ఇంటర్‌నెట్ దృశ్యాలను వాంతి చేసుకుంటున్నది
యాంత్రికతకు అలవాటు పడ్డ రోబోలా!
ఇప్పుడు కలం కాలం మింగేసిన ఆయుధం

---

# వానొచ్చేసింది

- జి. నర్సింహస్వామి
సెల్ : 9441041475



వానొచ్చేసింది
ఆకాశం గది తలుపుల్ని తోసుకుంటూ
మెరుపుల ఛత్రఛాయల్ని తొడుకుంటూ
చుక్కల ముత్యాల దండలా
మేఘాల్ని తనలో నింపుకుంటూ
నిన్నూ నన్నూ చూద్దామని
ఇన్నాళ్ళ ఎడబాటును ఎడం చేస్తూ
ఎండ చెల్లెల్ని వెనక్కి నెట్టి
తనూ ఉన్నానంటూ తనివితీరా తాకింది
ఒక్క చినుకు ప్రాణమై తడిపింది
జీవన నినాదమై నిలిచింది
గాలిని గంధంగా మారుస్తూ వచ్చింది
మనసు పొరల్ని సుగంధం చేసింది వాన
చిట్టిపాపల్ని చిన్ని గొడుగులా తాకింది
మట్టి పొరల్ని మౌనంగా చీల్చుకుని
ఆకాశగంగ పాతాళం వైపు పాములా పరుగు తీసింది
వేల కోట్ల ప్రాజెక్టులతో కాని పని
చుక్కతల్లి ధాన్యపు గింజకు ప్రాణ ప్రతిష్ట చేసింది
భూమిని నాగలితో నేత నేసిన రైతన్న
కంటిపాపగా మారి కలల రూపు దాల్చింది
నెర్రెలిడిన భూమాత వీపును లేపనంలా తాకింది
తొలకరికి ప్రాణం పోసి
ఇన్నాళ్ళు నిలిచిపోయిన ఊపిరుల్ని
తన హస్త స్పర్శతో సజీవం చేసింది
కాగి కాగి వున్న మట్టి ముద్దను
కౌగిలి స్నానంతో పునీతం చేసింది
ఇంతకాలం వానను మనమే దూరం చేసుకున్నాం
అడుగడుక్కి వానతల్లి పెంచిన చెట్టు చేతుల్ని
తెగనరికి భూమిని ఎడారి చేసినం
ఒక్కో చెట్టు లక్షలాది ప్రాణవాయువు లిచ్చింది
తన గాలి స్పర్శతో తనువును తన్మయం చేసింది
రామబాణంలా మారి వాన తన చేతుల్తో
మొక్కల్ని నాటటానికే వచ్చింది
మనమూ ఓ మొక్కగా మారి
జలం పునాదుల్ని కాపాడుకొమ్మని చెప్పటానికే వచ్చింది

కథ

# కంచికి చేరని కథ

- డా॥ మల్లెమాల వేణుగోపాలరెడ్డి



కథ చదివాను
చక్కని కథనం, శిల్పంపేరుతో వాస్తవాన్ని చుట్టేసి పాఠకుణ్ణి కంటికి కాటుక పెట్టే ప్రయత్నం లేదు.
వీక్లీ ప్రక్కన పెట్టాను
ఎక్కడో మెదడు నరాంతరాలలో.... ఒక మెరుపు
అవును..... నా అనుభవంలోనే తడిసిన గుర్తు. నా ఉచ్చిమీద దెబ్బేసి మెదడును లేపింది.

ఆలోచించాను.....

కథనా అనుభవంలోనిదే..... అయినా ఏ కథ అయినా ఎవరో ఒకరి అనుభవంలోనిదే గదా! రచయితో, పాఠకుడో చాలాసార్లు తమ కథ నే వ్రాసుకున్న తన కథనే చదువుతున్న ఫీలింగ్ నిజమేకదా!

సర్వే చేసి వర్గీకరించబడిన సమాచారం ప్రకారం ప్రపంచంలో ఉన్నవే ముప్పై ఆరు కథలు. అటు త్రిప్పీ, ఇటు త్రిప్పీ, కల్పనలు చుట్టించి, మసాలాలు దట్టించి చెప్పినా తిరిగి తిరిగీ ఆ ముప్పై ఆరే... జనంలో జీవన విధానాల ఘోషకు కథ దర్పణం పడుతుందని విశ్లేషకులు చెప్పినా, మౌలికంగా మనిషిలోని బలాలను, బలహీనతలను, తాత్వికతలను బహిర్గతం చేయడమేకదా! దానిని సమయ సందర్భాల స్థావర జంగముల మధ్య గానుగ తిప్పడమేగదా!

గురజాడ గానీ, గొల్లపూడి గానీ, కందుకూరి నుండి కాశీభట్ల వరకు, కొ.కు. నుండి. కా.రా. వరకు, మధురాంతకం అందరూ సంఘశ్రేయసుకోసం మనిషి నడవడిక కోసం దశానిర్దేశం చేయడమేకదా కథ పరమార్థం. హితవు బోధించడమే సాహిత్యమైతే ఆ హితవుకు సంక్షిప్తరూపమేకదా కథా ! కథానికను.

ఓహ్! నేనెక్కడికి పోతున్నాను... బుర్ర బ్రద్దలుకొట్టుకోకుండా..... ప్రస్తుత కథను గురించి....

ఈ కథ రచయితకు నా సన్నిహిత అనుభవంలోని విషయానికి వస్తువు ఎక్కడ దొరికింది. తెలుసుకోవాలని కుతూహలం. కథ చివర రచయిత సెల్ ఫోన్ నెంబరు కనిపించింది. అంత రాత్రిలో ఆయన్ను ఇబ్బంది పెట్టడం ఇష్టం లేక పడక మీద వాలాను.... ఆలోచనలలో రాత్రి కంటినిండా నిద్ర పట్టలేదు.

తెల్లవారింది.

రచయిత శేషగిరిరావుకు ఫోన్ చేసాను. నన్ను నేను పరిచయం చేసుకున్నాను. కథను గురించి ప్రశంసించాను. నన్ను గురించి చెప్పా.

ప్రస్తుతం విశాఖపట్నం... ఎల్. ఐ.సీలో అసిస్టెంటు డివిజనల్ మేనేజర్. రెండు కథాసంపుటాలు వెలువరించాడు.

"ఈ కథ విశాఖపట్నం నేపథ్యంలో లాగా లేదే!"

"లేదు! నేను విశాఖపట్నం సంవత్సరం క్రింద బదిలీ అయ్యాను అంతకుమునుపు తిరుపతిలో వున్నాను... అక్కడుండగా రాసిన కథ పత్రికలో వచ్చేందుకు ఇన్నాళ్లుపట్టింది" తిరుపతి అంటూనే నాకేదో అవినాభావసంబంధం గుప్పుమంది.

"తిరుపతిలో మీ నివాసమెక్కడ?"

"ఎం. ఆర్. పల్లె పంచాయితీ, శ్రీ కృష్ణనగర్ మునిరెడ్డి కాలనీ, ఆర్చ్‌వెనక 1/401 ఇంటిమేడపైన". "ఆయింటి ఓనరు పేరు?"

రెడ్డివారి రాజశేఖరం... రిటైర్డ్ హెడ్మాష్టరు"

థాంక్స్ బ్రదర్.

"ఇంతకు మీరెవరు ! ఎందుకడుగుతున్నారు?"

"కేవలం కుతూహలం. నేనిప్పుడు బెంగుళూరు లో స్టేట్ బ్యాంకులో ఉద్యోగం చేస్తున్నాను మన ప్రాంతమంటే ఎందుకో తెలుసుకోవాలని ఉబలాటం... అంతే" ఫోన్ కట్ చేసాను.



తల తిరుగుతుంది సోఫాలో కూలబడ్డాను పత్రికతెరచి మళ్లీకథ చదివాను. కథ నా ఒళ్లోనే వుంది, నా గుండెల్లో దాగి వుంది.

నేను ఆరేళ్ల క్రితం తిరుపతి స్టేట్ బ్యాంకులో వర్క్ చేస్తున్నప్పుడు, అదే అడ్రసులో, అదే మేడపైన అద్దెకున్నాను. అప్పటికి ముప్ఫై ఏళ్ల దేశముదురుని.

రాజశేఖరంగారు మేధావీ.... మర్యాదస్తుడు. కొడుకు సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగా పూణెలో.... ఒక్కగానొక్క కూతురు. ప్రతిభ... పాతికేళ్ల కన్యాకుమారి. స్టేట్ బ్యాంకులో క్యాషియర్... నేనూ అదే బ్యాంకులో......

రాజశేఖరం గారి భార్య రామలక్ష్మమ్మగారు సుగుణ సంపన్నురాలు.... ఆదర్శ గృహిణికి నిర్వచనాకృతి. మెస్ భోజనంతో విసిగిపోతే నాకు ఫల, పాయసాలు ఆమె ప్రసాదమే.. గులాబ్‌జాంలు నాకిష్టమని తెలిసిన ప్రతిభ..... గులాబీ పూలంటే ఆమెకిష్టమని తెలిసిన నేనూ పరస్పరం అందిపుచ్చుకోవడాలతో ఇద్దరి మధ్య దూరం దగ్గరైంది.

ఇంటిముందున్న పూల కుండీలకు నీళ్లు పోస్తూ, పూలుకోస్తూ నాకు ప్రతిరోజూ బాల్కనీలో నుండి సుప్రభాత దర్శనం ప్రతిభే.... ఆమెను చూస్తూ పేపరు క్రిందవడేసుకోవడం, కళ్లజోడు జారవిడుచుకోవడం.... తుడిచి మళ్లీ తరచిచూడడం అదొక దినచర్య.... అందులో ఒక ఆనందహేల. ఆఫీసులో ఆమె ఛాంబర్, నా ఛాంబర్ ప్రక్కప్రక్కనే. బిజినెస్ అవర్లో పరధ్యానంగా వుంటున్నానని మేనేజర్ రెండు సార్లు హెచ్చరించాడు.

ఇద్దరి మధ్య ఏదోతెలియని చలనం.... సంచలనం. పెదవి దాటిరాలేని... అంతర్మథనం. ముఖ్యంగా నాలోని ఉద్రిక్తపు పొంగును అణచుకోలేని బలహీనత. గతస్మృతులు మసకమసకగా... క్లారిటీకోసం దాచివుంచిన డైరీ పేజీలు తెరిచాను... అప్పుడు రోజు వారీగా రాసుకున్న డైరీ దృశ్యమానంగా.......

రాజశేఖరంగారూ, రామలక్ష్మమ్మగారు శ్రీరామనవమికి భద్రాచలం అట్నుంచి సింహాచలం యాత్రకెళ్లారు. శ్రీరామనవమికి బ్యాంక్ హాలిడే.

ఉదయాన్నే తలంటిపోసుకుని, వెంట్రుకలు జారుముడి వేసుకుని నేనిచ్చిన గులాబీ పువ్వును తలలో.... కాళ్లకు పసుపు. చందన లేపనం, తడి ఆరని దుస్తుల్లో ప్రతిభ.

ఇంటి ద్వారాలకు మామిడి తోరణాలు కడుతూ... పైకెత్తిన భుజాలు... బంగారు చెండులాంటి స్తనద్వయం, కందిరీగ నడుమూ. ఈ ముదిరిన బెండకాయను మత్తెక్కించే దృశ్యం. ఆమెకు సహాయంగా తోరణం చివరి దారం పట్టుకున్నాను. చేతులు దారం బిగిస్తున్నాయి కానీ చూపులు ఆమె సౌందర్యాన్ని జుర్రుకున్నాయి.

తోరణం కట్టేశాం.. నా చూపుల్ని ఆమె మరల్చుతూ.....

రండి ! పూజచేద్దాం

ఆమెను ఫాలో అయ్యాను. పూజ మొదలైంది.

"పావనగుణనామా" ! "పరమ పురుష ఏ తెరవు తేక నీ మరుగు జొచ్చితిని"

గంటమోగింది.... హారతిచ్చింది కళ్లకద్దుకున్నాను. తీర్థం సేవించాము. వడపప్పు పానకం ఆరగించాను.

మధ్యాహ్నం, రాత్రికీ మీకు ఇక్కడే భోజనం. వంటకాగానే కేకేస్తాను మేడపైకి వెళ్లండి.

తలూపాను. మేడపైకి వెళ్లి కథ రాద్దామని కాగితాలు కలం తీసాను.

వస్తువు కళ్లముందున్న నడుస్తున్న నిజమా? కాల్పనికమా? ప్రత్యక్షకథనమా? ఊహలక్రీడాభిరామమా? సందిగ్ధం...మూడ్ రాలేదు. కలం ముందుకు సాగలేదు. టి.వీ.ఆన్ జేసాను.

ఒక ఛానల్‌లో సీతాకళ్యాణం! ఇంకో ఛానల్లో 'శకుంతల' ఒకవైపు సీతారాముల పవిత్ర పరిణయం ముగ్ధమనోహర దృశ్యాలు. ఇంకోవైపు శకుంతల - దుష్యంతుల ప్రణయం. ఒకరకంగా సీత, శకుంతల లిద్దరూ తాకిక సంబంధాలలో బాధితులే. రెండు గంటలు గడిచాయి.

"చిత్తరంజన్‌గారు! మేడ దిగిరండి.... లంచ్ రెడీ" పిలుపు నన్నునేను కంట్రోల్ చేసుకోవడానికి ఆంజనేయుణ్ణి ఆవాహన చేసుకుని మేడదిగాను.

మినపవడ, ముద్దపప్పు, పులిహోర, పాయసం, మీగడ పెరుగు, అరిటాకుభోజనం రుచికరంగా

రాత్రికి హోళిగలు, వాంగీబాత్, కోకోనట్ రైస్, బాదం ఖీర్. ప్రతిభ ప్రొద్దున తలలో తురిమిన గులాబీ వాడిపోయింది. ఫ్రెష్‌గా మల్లెపూలు. నేనూ జాస్మిన్ బాడీస్ప్రేలో... భోజనం ముగిసింది. డైనింగ్ టేబుల్ సర్దుతూ ప్రతిభ. మల్లెపూలు వాసన మత్తెక్కిస్తూంది నా స్వాధీనంలో లేని ఉద్వేగం. ఆగలేకపోయాను.

ఆమె నడుమును రెండు చేతుల్తో చుట్టేశాను. వెనకవైపు నుండి నా మెడ ఆమె కంఠాన్ని చుట్టేసింది. ఆమె కళ్లు అరమోడ్పుగా, శ్వాసలో వూర్పులు, ఆమె చేతులతో నా భుజాలు పట్టేసింది. అసంకల్పితంగానే మా రెండు శరీరాలు పడకమీదికి జారిపోయాయి. గది తలుపులు తెరుచుకునే వున్నాయి. కనురెప్పలకు కర్టెన్ వేయలేదు. అదొక దివ్యానుభూతి. అపూర్వం. అనన్యం అర్ధనగ్నమైన శరీరాలు. మధుర సంశయం, అనురాగ సంగమం, ఆనందసంగమం....



రాజశేఖరం దంపతులు తిరిగివచ్చేదాకా ఆ వారంరోజులు ప్రతి రాత్రీ వసంతరాత్రి, ప్రతి గాలీ పైరగాలి. ప్రతి శ్వాస ప్రణయగీతిక మరవలేని క్షణాలు. అంతా డైరిలో దాచుకున్నాను. స్వీట్‌మెమోరిస్ రాసుకున్నాను. తర్వాత రెండు నెలలకు బెంగుళూరు ట్రాన్స్‌ఫరయ్యను ఒకరోజు ప్రతిభ నుండి ఫోన్. మాటల్లో ఎంతో ఆనందం, సిగ్గు. "మీ అంకురం నాలో నాటుకుంది నెలతప్పాను"

నాకు షాక్ తగిలింది. కామం కళ్లుగప్పి ఆమె మానం, శీలం దోచుకున్న వణుకు. ఏదో తెలియన మనోదౌర్బల్యం. "మనం పెళ్లి చేసుకోవాలి. వెంటనే మా అమ్మా నాన్నల్ని నేను ఒప్పిస్తాను"

ఆ వైపు ఫోన్. నన్ను ఆలోచించుకోనియ్ డియర్.

"ఏమాలోచిస్తారు గుట్టు బయటపడకముందే" ఒకక్షణం మౌనం.

"నన్ను మోసం చేయకండి" ప్రతిభ కంఠంలో ఆనందం ఆవిరై కంఠ స్వరం గాధ్గదికమైంది.

ఆ తర్వాత సంభాషణలలో కుదింపు.

ఆ తర్వాత పదే పదే ఫోన్.

"ఇప్పటి కిప్పుడు నేనేం చెప్పలేను! అబార్షన్ చేయించుకో. ప్రస్తుతానికి అదేమార్గం. ఆ తర్వాత ఆలోచిద్దాం" ప్రతిభ రోదిస్తున్న శబ్దం.. ఫోన్ ఆపుజేసేశాను... సిమ్‌కార్డు మార్చేసాను. ఫోన్ నెంబరు సీక్రెట్ కోడ్‌లో పెట్టాను. ఆ తర్వాత ఫోన్లు రాలేదు.

ఆ ఉత్కంఠ పరిస్థితిని అధిగమించడానికి ఆలోచనల పరిధిని విస్తృత పరిచాను. ఫలితంగా రెండు నెలల్లోనే పెళ్లి. సంవత్సరంలోగా మాకో చిన్నారి పాప.... పేరు కవిత. ఆ తర్వాత కథలు రాయడం మానేసాను. డైరీ మూసేసాను. సజావుగాసాగిపోతున్న సంసారజీవితం నుండి తిరుపతి స్మృతులను మెదడులో నుండి చెరిపేశాను. ఆమెను గురించి ఆలోచించడం మానేసాను. ఆ ఘట్టాన్ని, ఘటనల్ని మగతనానికీ, ఆ సంబరం ఒక సందర్భంగా కొట్టిపారేసి కాలరెత్తాను. కథలు రాయక పోయినా, కథలకు విశ్లేషణాత్మక విమర్శకుడిగా మారాను.

ఇప్పుడు ఈ కథ మళ్ళీ చదివాను.

కథలో ప్రతిభ తల్లిదండ్రుల పేర్లు మారాయి. ప్రతిభ పేరు ప్రతిమ. కథ అదే అదే...

ఎవడో దౌర్భాగ్యుని కామానికి దహనమైన ప్రతిమెంటల్ డిప్రెషన్ అయింది. చికిత్స చేయించారు. వైరాగ్యంతో నిండిన డిప్రెషన్.

నేను మొదట కథ చదివినప్పుడు ప్రతిమ పైన విపరీతమైన సానుభూతి శేషగిరిరావు ఆమెను దుర్భలంగా చూపించడం నాకు నచ్చలేదు. ముగింపులో అస్పష్టత సమస్యలను ధైర్యంగా ఎదుర్కొని సబలగా నిలబెట్టలేకపోయాడని నా విమర్శ. వైరాగ్యం లోకి తోసివేయకుండా ఆమెను ఓ హయ్యర్ పెడస్టల్‌మీద నిలబెట్టి వుండాల్సింది.

కానీ ఇప్పుడు

కథానాయకుణ్ణి నేనే కాబట్టి ఆలస్యంగానైనా నాలో అంతర్మధనం. నేను ప్రతిభను చూడాలి. తిరుపతి వెళ్లాలి. తీర్మానించుకున్నాను.

తిరుపతి స్టేట్‌బ్యాంకులో నా కొలీగ్ రవిశంకర్‌కు ఫోన్ చేశాను.

రవీ ! నేను చిత్తరంజన్‌ను బాగున్నావా?

"హే! రంజన్ బెంగుళూరులోనే వున్నావా? పెళ్ళయిందట. ఆహ్వానం రాలేదు మరి"

నావైపు నుండి మౌనం.

"ఇప్పుడు నేను ప్రమోషన్‌పై ఎన్.ఆర్.ఐ. సెక్షన్ మేనేజరయ్యా!."

"కంగ్రాచ్యులేషన్స్. ప్రతిభ పోస్టింగెక్కడ?"

"ఆమె వ్యాసాశ్రమంలో సన్యాసి దీక్ష తీసుకుని సులభానందగా మారింది. డిప్రెషన్ నుండి తేరుకుని ప్రశాంతంగా వుంది" నా గుండె కొట్టుకోవడం నా చెవులకే తెలుస్తుంది.

"ఆమె ఇప్పుడెక్కడుంది?"

"నాకు తెలిసిన సమాచారం. ప్రతిభ వ్యాసాశ్రమంలో సన్యాసి దీక్ష తీసుకుని సులభానందగా పేరు మారి అక్కడ ప్రశాంత వాతావరణంలో, ధ్యానం చేసుకుంటూ. భగవద్గీత ప్రచారకురాలైంది. మెంటల్ డిప్రెషన తొలగి పోయింది."

"థ్యాంక్స్ రవీ! జస్ట్ ఫర్ ఇన్ఫర్మేషన్" ఫోన్ పెట్టేశాను.



# గుండుసున్న

- అనువాదం : డా॥ జి.వి. రత్నాకర్

హిందీ మూలం : నాగార్జున్

సెల్ : 9849303175

భారతమాతకి ఐదుగురు కొడుకులు
క్రూరమైన శత్రువు తూటాకి ఒకడు నేలరాలాడు
ఇక నలుగురు మిగిలారు
భారత మాతకి నలుగురు కొడుకులు
నలుగురూ నిపుణులు - వ్యవహారదక్షులు
వారిలో ఒకరికి దేశ బహిష్కార శిక్ష విధించారు
ఇక ముగ్గురు మిగిలారు
భారతమాత ముగ్గురు కొడుకుల్లో
ఒకడు రణరంగానికి తరలివెళ్ళాడు
అలా ఇద్దరే మిగిలారు
భారతమాత ఇద్దరు కొడుకుల్లో
ఒకడు అన్నదమ్ముల అనుబంధాన్ని మరిచిపోయి
పదవీ వ్యామోహంతో సింహాసనానికి అతుక్కుపోయాడు
ఇక ఒకే ఒక్కడు మిగిలాడు
భారతమాత వీర కుమారుడు భుజంపై ఎర్రజెండాతో
లాల్ సలామ్‌లు పలుకుతూ ముందుకి కదం తొక్కి కదిలాడు
పోలీసులు పట్టుకొని అండమాన్ జైలులో వేశారు
చివరికి గుండుసున్న మిగిలింది

---

# నీతి

- తగరం క్రిష్ణయ్య

సెల్ : 9440578404



ఎక్కడో ఒక చోట
ఏదో ఓ మూల
గాలి వీచిన దిక్కు
మూలన పడ్డ కట్టె కుర్చీలా
చిల్లు పడ్డ కుండలా
చినిగిన పంచెలా
చివరికి కవి కూడా దొరకని వస్తువులా!
నీవుండిపోతే
నమిలి మింగేసిన గింజవవుతావు
రాసి తుడిచేసిన అక్షరమవుతావు

పువ్వుల్లో పురుగులై
శనగ చేలు గొంగలులై
ఆకలిగొన్న రాబందులు
మెదడులేని రోబోలు
ప్రకృతికే పాఠాలు నేర్పుతాయి

2జిలను 3జిలను పేజీల్లోనే
ఉరి లేని కొయ్యతో ఉరేస్తుంటే
కూత రాని పక్షిలాగే ఉండిపోయావ్

మైనింగ్‌లను సైనింగ్‌లు చేసి
సద్ద చేళ్ళో వాలిన ఊరి పిచ్చుకలా ఆరగిస్తుంటే
పాలకులు - కాళ్ళు లేని నవాబులు
ప్రజలు - కుళ్ళిపోయిన టమోటాలు
చివరకు రెక్కలు లేని పక్షిలా నీవు

పెళ్ళయిన తర్వాత మేళాలన్నట్లు
తీరా... ఇప్పుడొచ్చి మూల్గుతున్నావ్
ఇప్పటికైనా! ఉంటావో! చస్తావో!
ఉన్నన్నాళ్ళూ ఉప్పెనవ్వు
అవినీతి గుండెల్లో గునపమవ్వు
గడగడపకు ఎర్రని బొట్టువవ్వు

---

వ్యాసాశ్రమం వెళ్లాను సులభానందను కలిసేందుకు పర్మిషన్ తీసుకున్నాను. అతిథి గృహంలో ఆమెను కలిశాను. తెల్లచీర, ఫుల్‌స్లీవ్స్ పొడుగు చొక్కా నుదుట విభూతి, మెడలో రుద్రక్షమాల, ప్రక్కనే స్టూలు మీద "గీతా మకరందం" బృహత్ గ్రంథం. నమస్కరించాను... ప్రతి నమస్కారం. ముఖంలో ప్రశాంతత, రెండు గులాబీపూలు అందించాను తీసుకుని శ్రీకృష్ణుని ఫొటో ముందుంచింది.

కొంచెంసేపు మౌనం.

"పిల్లలెంత మంది?" అడిగింది.

"ఒక పాప ! నాలుగేళ్లు, పేరు ప్రతిభ" అబద్ధమాడాను.

"అమ్మా నాన్న బాగున్నారా" అడిగాను.

"గుర్తున్నారా?"

"ఎలా మరచిపోగలను?"

నమస్కరించి లేచింది.

నాకు ప్రచారకుల శిక్షణ క్లాసుంది. వెళ్లాలి. భగవద్గీత పుస్తకం నా చేతికందించి, వెనుదిరిగి చూడకుండా వెళ్లిపోయింది. దీర్ఘంగా నిట్టూర్పుతో కూడిన శ్వాసతో నేను....

కథలకు విశ్లేషణాత్మక విమర్శలకుగాను నేను ఈ కథకు సమగ్రమైన, తగిన ముగింపు యివ్వలేకపోయాను. ఆమె యిచ్చిన ముగింపు ప్రతిభను సులభంగా సులభానందగా మార్చేసింది.

తిరుగు ప్రయాణంలో ఆలోచనలు.

ఎనిమిదేళ్ల క్రితం నేను వ్రాసిన కథ "తిరగబడిన మహిళ" గుర్తుకొచ్చింది. అత్యాచారానికి గురై గర్భవతైన ఒక యువతి సమస్యలకు ఎదురొడ్డి, నిందితుణ్ణి జైలుకంపి నవమాసాలు మోసి ఓ ఆడపిల్లకు జన్మనిచ్చి, బిడ్డకు ధైర్యసాహసాలను ఉగ్గుపాలలో నూరిపోసిన ఆమె కథకో మంచి ముగింపునిచ్చి ఓ సాహసవేదిక మీద నిలబెట్టాను. మరి ఇప్పుడు

ఈ కథకు నేనిచ్చిన ముగింపేమిటి?

కథలు ముప్పై ఆరే కాదు. కాదు... ఎన్ని జీవితాలున్నాయో అన్నీ కథలకు వస్తువులై విస్తరించుకున్నాయి ఒక్కో కథకు ఒక్కొముగింపు.

ఇప్పుడు ఈ కథకు సముచితమైన, సమగ్రమైన ముగింపు ఇవ్వలేక పోయాను.... ఇది ఓ అసమర్థుని జీవితయాత్ర. ఈ కథ నా విశ్లేషణాత్మక విమర్శకు అందదు.

కథ వ్యాసాశ్రమానికి చేరింది. చేరాల్సిన చోటుకు చేరలేదు.

సెల్ : 9908591998

# ఒక్క రాత్రి

- మామిడి హరికృష్ణ
సెల్ : 9010234006

రాత్రులు నాకు కొత్త కాదు
చీకటి రాత్రి - వెన్నెల రాత్రి - అమావాస్య రాత్రి - కరెంట్ పోయిన రాత్రి
వర్షపు రాత్రి - వేసవి రాత్రి - చలి రాత్రి - అర్ధరాత్రి
అన్ని రాత్రులూ నాకు పరిచయమే
కానీ ఈ రాత్రి మాత్రం
కొంచెం రాత్రిలా అనిపిస్తోంది



ఇప్పటిదాకా -
ఏ ఒక్క రాత్రి నాకు రాత్రిలా అనిపించలేదు
ప్రపంచమంతా నిద్రిస్తున్న రాత్రి సమయంలోనే
నా మనో ప్రపంచానికి రెక్కలు మొలిచేది
ఈ చీకట్లోనే - అక్షరాల మిణుగురులు
వాక్యాల పరిమళాలతో
నన్ను చుట్టుముట్టేది..
ఈ రాత్రిలోనే -
నేను హిచ్‌కాక్‌ని - క్వింటిన్ టొరంటినోని - కొప్పొలాని
సిసిల్ డిమెల్లిని - అకీరా కురొసావాని - అబ్బాస్ కైరెస్తమీని
ఆహ్వానించేవాణ్ణి
వాళ్ళు సృష్టించిన చుక్కల లోకం
నా నిండా పర్చుకునేది
ఈ రాత్రి సమయంలోనే
డెల్‌కార్నెగీ - పాలోకొయిలో - రాబిన్ శర్మ
చేతన్ భగత్ - గాబ్రియెలా మార్క్వెజ్ - అలెక్స్ హేలీకి
నా వాదనలు వినిపించేవాణ్ణి
వాళ్ళు చేసిన భావప్రపంచం
నా అంతటా ప్రవహించేది...
ఇప్పటిదాకా నాకు రాత్రి అంటే -
చేతనలోని సర్వేంద్రియాలు షట్‌డౌన్ అయి
మనసు మాత్రమే ఓపెన్ అయ్యే
ఆల్టర్నేటివ్ వరల్డ్
నేను కాస్తా ఎగిరిపోయి
ఒకానొక 'ఉటోపియా' సాక్షాత్కరించే ప్రదేశం
నాకు రాత్రి - ఓ నిరంతర చైతన్యగీతం
నిత్య వినూత్న ఊహా నృత్యం...
....
కానీ ఇన్నాళ్ళకి -
ఇప్పుడు రాత్రి
రాత్రిలా అనిపిస్తోంది
ఇవన్నీ ఉండి కూడా
రాత్రి రాత్రిలాగే అనిపిస్తోంది...
ఈ రాత్రి
నువ్వు నాతో చేరినందుకేనేమో!

---

# ఎన్నాళ్ళు... ఇంకెన్నాళ్ళు?

- ఇల్ల ప్రసన్నలక్ష్మి



వికసించాల్సిన కుసుమపు అంకురాన్ని
ఆదిలోనే అంతమొందించే వేరుపురుగులు
విశ్వరూపం దాల్చితే...
కమ్మని కలలు కనే కనుపాపలకేం తెలుసు...?
కాపాడాల్సిన కనురెప్పే కాలనాగై కాటేస్తుందని!
లాభ నష్టాల బేరీజు
ఆడ - మగ పుట్టుకను నిర్దేశించడం రివాజైతే...
చెరపట్టబడ్డ శాస్త్రీయతకు పరాకాష్ఠ లింగ నిర్ధారణం
చెదపట్టిన బుద్ధి చూపెడుతోన్న వివక్షతా దర్పణం
అబలత్వపు గ్రహణాన్ని వీడి
సబలగా నిలిచిన స్త్రీతత్వం
ప్రగతిపథ పద ఘట్టనను
అవనిలో... ఆకాశంలో ప్రతిధ్వనింప చేస్తూంటే..
'స్త్రీ సాధికారత'ను నినదిస్తూ
స్త్రీ జన్మని నియంత్రించే పురుష ప్రపంచం
మానవతను మంటగలిపి... పాశవికతకు తెరదీసి
ఉసురు ఊపిరి రూపం దాల్చకుండానే
ఊహల తీరం దరి చేరకుండానే
కాఠిన్యపు కరవాలాన్ని ఝుళిపిస్తూ
ఆమె పుట్టుకను నిషిద్ధ నిశ్శబ్దాక్షరిగా మిగిల్చిన వైనం
నివురుగప్పిన నాగరికతా పరిణామ క్రమంలో ఏమంత ఘనం?
జననపు తొలికేక తల్లి పేగు నుండి విడివడకుండానే
జనని గర్భపు గోడల్లో సమాధై పోతున్న మరణపు పొలికేక
మానవతకు ఆనవాళ్ళున్న గుండెలకు చేరువై
ఎన్నాళ్ళు... ఇంకెన్నాళ్ళు...? ఈ వివక్షతంటూ
ప్రశ్నల శరాలను సంధిస్తూ
మీ ఉనికి ప్రశ్నార్థకంగా మారే
ప్రమాద ఘంటికను సూచిస్తూనే వుంటుంది



# సూర్యప్రకాష్ అద్భుత రంగుల ప్రపంచం

- గుడిపూడి విజయరావు

సూర్య ప్రకాష్ తొలుత పాతఅటోమొబైల్స్‌ను చిత్రించినా, తర్వాత గాలికి ఎగిరిపోయే ఎండుటాకును చిత్రించినా, ఇటీవల పుష్పాలతో కూడిన సరస్సును చిత్రించినా, ఇప్పుడు ప్రకృతిదృశ్యాలను చిత్రించినా అన్నీ పాక్షిక వాస్తవిక చిత్రాలే. వాటిలో వాస్తవికత పాలు ఎంత ఉంటుందో, వూహాశక్తి పాత్ర కూడ అంతే ఉంటుంది. ఓ రకంగా వూహాశక్తిదే పైచేయి అవుతుంది. పరిసరాలను గమనిస్తూ ఉన్నప్పుడు ఏదో ఒక అంశం తళుక్కున ఆకర్షిస్తుందని, అది మనస్సులో బీజంలా నాటుకుంటుందని, అలా నిక్షిప్తమైనదాన్ని తన వూహాశక్తి జోడించి కేన్వాసుపై ఎక్కించడమే తన చిత్రకళావిధానమని సూర్య ప్రకాష్ చెబుతున్నారు.

అంతులేని ట్రాఫిక్ జామ్‌లను అధిగమించి, మితిమీరిన శబ్దకాలుష్యాన్ని, వాయు కాలుష్యాన్ని లెక్కచేయకుండా హైదరాబాదు నగరం నడిబొడ్డులో బంజారాహిల్స్, రోడ్ నం 10లోని కళాకృతి ఆర్ట్ గ్యాలరీలో అడుగిడిన వారికి ఆనంద పరవశులనుచేసే దృశ్యాలు స్వాగతం పలుకుతాయి. సాధారణంగా ఆర్ట్ షో ఏదైనా జరిగితే గోడలకు అనేక పెయింటింగ్స్ వేలాడదీసి ఉంటాయి. వాటిని ఆస్వాదించాలంటే దేనంతటదాన్నే ప్రత్యేకంగా చూడాల్సి ఉంటుంది. కాని గత నవంబరు 22న ప్రారంభమయిన సూర్యప్రకాష్ సోలో ప్రదర్శన దీనికి పూర్తి భిన్నమైనది. ఆయన కళాత్మక సృష్టి మొత్తం గ్యాలరీ వాతావరణాన్నే మార్చేసింది. ఆకర్షణీయమైన వర్ణాల భారీ కేన్వాసులు అందమైన ప్రకృతి మధ్య సంచరిస్తున్న అనుభూతిని ప్రేక్షకులకు కలిగించాయి. బయటి గందరగోళం, రణగొణధ్వనులను పూర్తిగా మరిచిపోయి విభిన్న ప్రపంచంలోకి మనల్ని తీసుకుపోతాయి.

హైదరాబాదు చిత్రకళారంగం గురించి చెప్పగానే ముందుగా స్ఫురించేది త్రిమూర్తులు లాంటి పేర్లు- తోట వైకుంఠం, కె లక్ష్మాగౌడ్, సూర్య ప్రకాష్. అనేక దశాబ్దాలుగా చిత్రకళాప్రస్థానం చేస్తూ, ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న వీరు ముగ్గురు దేశంలోని ఏ మహానగరంలోనో, విదేశాల్లోనో స్థిరపడి నిలబడగలిన ప్రజ్ఞాపాటవాలున్నా నగరాన్నే అంటి పెట్టుకోవడం విశేషం. ఇక్కడి చిత్రకళాభిమానులకు, విద్యార్థులకు అది తరగని పెన్నిధి. తమ చిత్రాలను దేశ, విదేశాల్లో ప్రదర్శిస్తూ విశేష ఆదరణ పొందుతున్న వీరు, హైదరాబాదు లాంటి చోట్ల కొనగలిగిన తాహతు, అభిరుచి ఉన్నవారు

అంతగా లేరని తెలిసినా తమ చిత్రాలను అప్పుడప్పుడైనా ఇక్కడ ప్రదర్శించడం బహుశా ఈ నగరం పట్ల వారికి ఉన్న మక్కువ వల్లనే. ఇప్పుడు మనం చెప్పుకుంటున్న సూర్య ప్రకాష్ షో అలాంటిదే.



సూర్య ప్రకాష్ తొలుత పాతఅటోమొబైల్స్‌ను చిత్రించినా, తర్వాత గాలికి ఎగిరిపోయే ఎండుటాకును చిత్రించినా, ఇటీవల పుష్పాలతో కూడిన సరస్సును చిత్రించినా, ఇప్పుడు ప్రకృతిదృశ్యాలను చిత్రించినా అన్నీ పాక్షిక వాస్తవిక చిత్రాలే. వాటిలో వాస్తవికత పాలు ఎంత ఉంటుందో, వూహాశక్తి పాత్ర కూడ అంతే ఉంటుంది. ఓ రకంగా వూహాశక్తిదే పైచేయి అవుతుంది. పరిసరాలను గమనిస్తూ ఉన్నప్పుడు ఏదో ఒక అంశం తటుక్కున ఆకర్షిస్తుందని, అది మనస్సులో బీజంలా నాటుకుంటుందని, అలా నిక్షిప్తమైనదాన్ని తన వూహాశక్తి జోడించి కేన్వాసుపై ఎక్కించడమే తన చిత్రకళావిధానమని సూర్య ప్రకాష్ చెబుతున్నారు. అయితే పాతఅటోమొబైల్స్, ఎండుటాకుల చిత్రాలు పూర్తి నైరూప్యమైనవి. ఎదురుగా కనిపించే ఆ ఆకృతులతో ఎన్నెన్నో విషయాలను స్ఫురింపచేయడం ఆయన ఉద్దేశం. ఎండుటాకుల చిత్రాలలో అయితే అధివాస్తవికధోరణి ప్రతిబింబిస్తుంది. కాని తర్వాత పూల సరస్సులు, ప్రకృతి దృశ్యాలు పాక్షిక వాస్తవికమైనవే అయినా వాటిలో నిగూఢమైన అర్థాలేమీ ఉండవు. ప్రేక్షకునికి ఆనందం కల్గించడమే వాటి ఏకైక లక్ష్యం. ఆ లక్ష్యాన్ని ఏ మేరకు సాధించకలిగాడో కళాకృతి షోయే నిరూపిస్తున్నది.

ప్రవేశద్వారాన్ని ఆనుకొనిఉన్న హాలులోకి ప్రవేశించగానే గోడకు ఉన్న ఒకే కేన్వాసు చూపులను కట్టిపడేస్తుంది. అది అది రెండు పర్వతాలమధ్య హొయలుగా ప్రవహించే నదిని మనోహరంగా చిత్రిస్తుంది. అది డిప్టిక్. అంటే దానిలో రెండు పెద్ద విభాగా లుంటాయి. తాను నార్వేలో పర్యటిస్తున్న సమయంలో ఈ అద్భుత దృశ్యాన్ని తిలకించానని, పర్యాటకులందరూ తమ తమ కెమెరాలలో దాన్ని బంధిస్తుండగా, తాను తన మనోఫలకంపై ముద్రించుకున్నానని, ఆ జ్ఞాపకాల ఆధారంగా చేసిన ప్రతిసృష్టే ఈ అపురూప కళాఖండం అని ఆయన చెబుతున్నారు. మనమూ అక్కడికెళ్లి ఆ దృశ్యాన్ని తిలకించామన్న అనుభూతిని ఈ చిత్రం కలిగిస్తుంది. ఆయన వాడిన వర్ణాలు దానికి పూర్తిగా దోహదపడ్డాయి.

ఈ తరహా చిత్రరచనకు పూనుకోవడానికి తనకు మోనే, సెజాన్ లాంటి యూరోపియన్ ఇంప్రెషనిస్టులు, పోస్ట్ ఇంప్రెషనిస్టుల నుండి స్ఫూర్తి పొందానని ఆయన అంటున్నారు. ఇంప్రెషనిజం అంటే ప్రకృతి దృశ్యాలను ఒకే రోజులో వేర్వేరు సమయాలలో, ఒక సంవత్సరంలో వేర్వేరు రుతువుల్లో చిత్రించడమే. ఆయా సమయాలలో, లేదా ఆయా రుతువుల్లో ఒకే దృశ్యం ఎలా కనిపిస్తుందో చూపడం, ఆ అనుభూతిని ప్రేక్షకులకు కల్గించడం ఈ చిత్రాల ఉద్దేశం. అనుభూతి ప్రధానమైన ఈ చిత్రాలలో వర్ణాలు, వాటి వెలుగునీడలదే ప్రముఖ పాత్ర. సాధారణ చిత్రాలలో మాదిరి ఆయా ఆకృతుల ఔట్‌లైన్లు, వాటిని రంగులతో నింపడం లాంటి ప్రక్రియ ఇక్కడ ఉండదు. సూర్యప్రకాష్ తన చిత్రాలలో ఇంప్రెషనిస్టు తరహాతో పాటు, ఆ తర్వాత దానిలోనే వచ్చిన పాయింటిలిజం- అంటే వర్ణాలను అసంఖ్యాకమైన చుక్కల రూపంలో వినియోగించే ధోరణిని కూడ అనుసరించారు.



వెడల్పాటి బ్రష్‌లను వినియోగించి పెయింట్‌ను కేన్వాసుపై చిలకరించడంతో తన పెయింటింగ్ ప్రారంభమవుతుందని, అలా ఆ తర్వాత మరో పెయింట్‌ను మరో లేయర్‌గా చిలకరించడం- ఇలా ఒక దాని తర్వాత మరొకటిగా పలు లేయర్ల ద్వారా తాను చిత్రించదలిచిన ఆకృతులు ఏర్పడతాయని, చివరిగా ఆ ఆకృతులను పాయింట్ బ్రష్‌లతో చుక్కలు, గీతలతో విపులంగా కనిపించేలా చేస్తానని సూర్యప్రకాష్ చెబుతున్నారు. ఆయన వాడేవన్నీ తేజోవంతమైన పసుపు, ఆకుపచ్చ, ఎరుపు, ఆరెంజ్ లాంటి వర్ణాలే. తన అద్భుత కళా కౌశలంతో, సృజనాత్మకతతో ప్రేక్షకులను కట్టిపడేసే దృశ్యాలను ఆ వర్ణాలతో ఆయన

సృష్టిస్తున్నాడు.

తన చిత్రాలను దూరం నుండి చూడవచ్చు, దగ్గరనుండి చూడవచ్చు, పూర్తిగా చూడవచ్చు, దానిలో కొంత భాగాన్ని చూడవచ్చు- ఎలా చూసినా ప్రేక్షకులు ఆస్వాదించి ఆనందించవచ్చని ఆయన చెబుతున్నారు. దీనికి నిదర్శనం ఈ ప్రదర్శనలోని అతి పెద్ద కేన్వాసు. నాలుగు విభాగాలుగా ఉన్న ఈ ప్రకృతి దృశ్యం నిడివి దాదాపు 24 అడుగులు, ఎత్తు 5 అడుగులు. మొత్తంగా దూరం నుండి చూసినపుడు ఓ రకమైన అనుభూతిని పొందితే, దగ్గరకు వెళ్లి నిశితంగా పరిశీలించినపుడు మరొక రకమైన అనుభూతికి ప్రేక్షకుడు గురి అవుతాడు. ప్రదర్శనలోని మిగిలిన కేన్వాసులు కూడ సాధారణ ప్రదర్శనల్లో అయితే భారీ చిత్రాల క్రిందే లెక్క. చిన్నవా పెద్దవా అన్నదానితో నిమిత్తం లేకుండా ప్రతి ఒక్క చిత్రం ప్రేక్షకులను ఆనందపరవశంలో ముంచెత్తుతుంది.

ఇంతటి అద్భుత కళాసృష్టి చేస్తున్న సూర్యప్రకాష్ 1940లో మధిరలో జన్మించారు. హైదరాబాదులో చిత్రకళను అభ్యసించి, న్యూఢిల్లీలో ప్రఖ్యాత చిత్రకారుడు రాంకుమార్ వద్ద శిక్షణ పొందారు. 1963లో హైదరాబాదులో ప్రారంభించి ఇప్పటివరకూ 50 పైగా సోలో ఎగ్జిబిషన్లను దేశ, విదేశాలలో నిర్వహించారు. ఐరోపా, అమెరికా తదితర అనేక దేశాలలో లెక్కలేనన్ని గ్రూపుషోలలో పాల్గొన్నాడు. అనేక ఎగ్జిబిషన్లను క్యురేట్ చేశారు. 5వ, 11వ జాతీయ త్రైవార్షిక చిత్రప్రదర్శనలకు మెంబర్ కమిషనర్‌గా పనిచేశారు. ఎన్నో జాతీయ, రాష్ట్రస్థాయి ఎగ్జిబిషన్లకు జ్యూరీగా వ్యవహరించారు. నేషనల్ గ్యాలరీ ఆఫ్ మోడర్న్ ఆర్ట్ (ఎన్‌జిఎంఏ) ఆర్ట్‌ఎడ్వైజరీ కమిటీ సభ్యునిగా కూడ ఉన్నారు. భారతదేశంలోను, విదేశాల్లోను పలు ఆర్టిస్టు వర్క్‌షాపుల్లో పాల్గొన్నారు. పలు ప్రభుత్వ, కార్పొరేట్ సంస్థలలో, విద్యాసంస్థలలో ఆర్ట్ క్యాంపులను నిర్వహించారు. హైదరాబాదులోని రెండు ప్రధాన శాస్త్ర సంస్థలైన ఎల్‌వి ప్రసాద్ ఐ ఇన్‌స్టిట్యూట్, సెంటర్ ఫర్ సెల్యులర్ అండ్ మోలిక్యులర్ బయాలజీ (సిసిఎంబి)ల చిత్రకళా సేకరణకు ఆయన బాధ్యత వహించారు. జాతీయ, రాష్ట్ర స్థాయిలో అనేక అవార్డులు,



రివార్డులు ఆయన స్వంతం. ప్రస్తుతం ఆయన ఎల్‌వి ప్రసాద్ ఐ ఇన్‌స్టిట్యూట్‌లో స్టూడియో ఏర్పాటు చేసుకొని పనిచేస్తున్నారు. అక్కడే చివరి అంతస్తులో ఆయన చిత్రాల గ్యాలరీ కూడ ఉంది.

హైదరాబాదు చిత్రకళారంగం పట్ల, దాని పరిణామం, తీరుతెన్నుల పట్ల సూర్యప్రకాష్ నిరంతరం ఆసక్తి కనపరుస్తుంటారు. నగరంలో నేడు పలు విశ్వవిద్యాలయాలలో చిత్రకళావిభాగాలు ఏర్పడటం, ఎంతో మంది యువచిత్రకారులు రంగంలోకి రావడం పట్ల ఆయన ఎంతో ఆనందం వ్యక్తం చేస్తుంటారు. అలాంటి వారు ఏర్పాటు చేసే పలు షోలకు ఓపిగ్గా హాజరవుతుంటారు. ప్రస్తుతం నగరంలో రెగ్యులర్‌గా పనిచేసే వారుగా గుర్తింపు పొందిన చిత్రకారులు కనీసం 25 మంది ఉంటారని, గతంలో ఇలాంటి పరిస్థితి లేదని ఆయన చెబుతున్నారు. ఒకప్పుడు హైదరాబాదు ఆర్ట్ సొసైటీ, ఆంధ్రప్రదేశ్ లలిత్‌కళాఅకాడమీ లాంటి సంస్థలు మాత్రమే చిత్రకళా ప్రదర్శనలను నిర్వహించి, వాటి అమ్మకాలకు ఎంతో కొంత



దోహదపడుతున్న దశ నుండి ఇటీవల కాలంలో అనేక వాణిజ్యపరమైన గ్యాలరీలు ఉనికిలోకి రావడాన్ని ఆయన స్వాగతిస్తున్నారు. ఇరవై ఏళ్ల క్రితం నగరంలో ఒక్క ప్రైవేటు కమర్షియల్ ఆర్ట్ గ్యాలరీ కూడ లేదంటే ఇప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది. అయితే కేవలం ఇంట్లో డెకరేషన్ కోసం ఒకటీ అరా పెయింటింగ్‌లు కొనడం కొంత పెరిగినందువల్ల చిత్రకళాసేకరణ అభివృద్ధి చెందిందని భావించరాదని, కళాఖండాలను ఒక ఇన్వెస్ట్‌మెంట్‌గా భావించి కొనుగోలు చేసే సేకరణదారులు దాదాపు లేరని ఆయన చెబుతున్నారు. చిత్రకళపట్ల లోతైన అవగాహనతో కొనుగోలు చేసే వారు ఉన్నప్పుడే అది సాధ్యమవు తుంది. అలాంటి వారు ఇతర ప్రధాన నగరాలలో ఉన్నట్లు ఇక్కడ లేకపోవడమే ప్రధాన కారణం అని ఆయన అభిప్రాయం.

ఇలాంటి పరిస్థితి రావాలంటే ప్రజల్లో కళగురించిన అవగాహన మెరుగు పడాలని అప్పుడే ఉత్తమ చిత్రాలకు ఆదరణ పెరుగుతుందని సూర్యప్రకాష్ అంటారు. ఆయన చిత్రాలు సాధారణ ప్రేక్షకునికి అర్థం కావన్న భావన పట్ల కూడ ఆయన ఇదే మాదిరిగా స్పందిస్తారు. కళను అర్థంచేసుకోవాలంటే ప్రేక్షకుడు కూడ తన సన్నద్ధతను పెంచుకోవాలన్నది ఆయన ఉద్దేశం. తనబోటివారు ఏదైనా సెమినార్‌లో ప్రసంగించడం, ఒక ఆర్ట్ వర్క్‌షాపును నిర్వహించడం లాంటివి చేయగలం తప్ప ప్రజల్లో కళపట్ల అవగాహన పెంచడానికి ప్రధానమైన కృషి మీడియా వైపునుండి జరగాలన్నది ఆయన అభిప్రాయం. ప్రస్తుతం చిత్రకళ గురించి, కళా ప్రదర్శనల గురించి మీడియాలో వచ్చే కవరేజి పట్ల సంతృప్తి వ్యక్తం చేస్తూనే అది బాగా మెరుగుపడాలని ఆయన భావిస్తున్నారు. కేవలం ఫలానా చోట, ఫలానా రోజు, ఫలానా ఆర్టిస్టు కళా ప్రదర్శన ప్రారంభ మయిందన్న వార్తల దగ్గరనుండి, తరతమ స్థాయిల్లో విశ్లేషణతో కూడిన కథనాలు కూడ వస్తున్నాయని, ఇంకా లోతుగా అవగాహనచేసుకొని, విశ్లేషణాత్మకమైన, విమర్శనాయుతమైన రచనలు వచ్చినపుడే కళగురించి సరైన అవగాహన విస్తారమైన ప్రజల్లో ఏర్పడుతుందని వివరించారు. చిత్రకళ పట్ల అవగాహనను, ఆసక్తిని బాల్యం నుండే కల్గించాలని, పాఠశాలల్లో చిత్రకళను ఒక సబ్జెక్టుగా ప్రవేశపెట్టాలని కూడ ఆయన ఆశిస్తున్నారు.

ఆధునిక ఇటలీ కవులు

- సౌభాగ్య

సెల్ : 9848157909



# సీజరే పావేసీ

## *(Cesare Pavese)*

**1908-1905**

సీజరే పావేసీ గ్రామీణ మధ్యతరగతి కుటుంబానికి చెందినవాడు. ఐదవ సంతానం. శాంటో స్టిఫానో బెల్టోలో జన్మించాడు. ఆరేళ్ళ వయసులో తండ్రిని కోల్పోయాడు. చదువుకునే రోజుల్లోనే ఫాసిస్టు వ్యతిరేక దృక్పథమున్న ఉపాధ్యాయుని ప్రభావానికి లోనయ్యాడు. యువకుడుగా వున్నప్పుడు ఆంగ్ల సాహిత్యం పట్ల ఆకర్షితుడయ్యాడు. వాల్ట్‌విట్మన్‌పై పరిశోధన చేశాడు. అమెరికన్, బ్రిటిష్ కవుల్ని ఇటలీ భాషలోనికి అనువదించాడు.

ఫాసిస్టు వ్యతిరేక రచనల వల్ల 1935లో అరెస్టయ్యాడు. రాజకీయ ఖైదీగా 'శారీరక నిర్బంధ శ్రమ' చేసే కేంద్రాలకు పంపబడ్డాడు. సంవత్సరం తరువాత విడుదలై ట్యూరిన్ నగరం తిరిగి వచ్చి వామపక్ష భావాలున్న 'Giulio Einandi' అన్న పత్రికకు సంపాదకుడుగా, అనువాదకుడుగా పనిచేశాడు.

రోం నగరంలో వున్నప్పుడు ఆస్మాత్ ఆర్నెల్లు ఆసుపత్రిలో గడిపాడు. యుద్ధకాలంలో సైన్యంలో చేరలేదు. యుద్ధానంతరం ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడయ్యాడు. పార్టీ పత్రికలో పనిచేశాడు.

తను మరణించడానికి ముందు చాలాసార్లు తను జన్మించిన ఊరును సందర్శించి ప్రశాంతతను పొందాడు. 1950లో 'Strega Prize' అందుకున్నాడు.




సీజరే పావేసీ 1950 ఆగస్టు 27న ఒక హోటల్లో నిద్రమాత్రలు మింగి ఆత్మహత్య చేసుకున్నాడు.

ఆయన చివరి రచన 'The moon and the Bonfire' అది louise sinclair 1952లో ఆంగ్లంలోకి అనువదించాడు.

### సహజాతం

ఆ ముసలాడు ప్రతిదానికీ చిరాకు పడతాడు. ఇంటి మెట్ల మీద కూచుని ఎండలో ఒంటిని వెచ్చబరచుకుంటూ ఒక కుక్కను, పడుపుగత్తెను చూస్తూ కూచుంటాడు.

# నానీలు

- డా॥ ఇ.విష్ణువందనాదేవి

సెల్ : 9550702025



పక్షుల భాష
అర్థం కాలేదా?
చెట్టు నాటినందుకు
ప్రశంసలవి

రాతి గోడలకు
బంగారు తొడుగా?
దాచేస్తే దాగదు
చరిత్ర

చంపడానికి
ఆయుధాలెందుకు?
ఒక్క మాట చాలు
ప్రాణం తీయడానికి

నోరున్న మూగవాళ్ళు
ఎవరో తెలుసా?
ఎస్ఎంఎస్‌లు
నొక్కే వాళ్ళు

నీ అవయవాలన్నీ
పని చేస్తున్నాయిగా
మరి నువ్వెందుకు
చెయ్యవు?

# పథగామి

- ములుగు లక్ష్మిమైథిలి

సెల్ : 9441685293



నీవు పయనిస్తున్న దారిలో..
ఏరులున్నా... ఎడారులున్నా...ఆగకు..
నీ జీవనిలో కష్టాలున్నా...
కన్నీళ్ళున్నా కుంగకు..
అగాధాలు... అవమానాలు ఎదురైనా..
నిరాశ బతుకు వలయం నుంచి విడిపడు..
కర్కశ ధ్వనులు, కరాళ నృత్యాలు నిన్నంటవు..
వేదనలైనా... వాదనలైనా...వినకు...
అగ్ని శిఖలు నిన్ను దహించవు..
నిశిలో.. శశిలా... కసిగా... పయనించు..
అలుపెరగని... గెలుపుకై పోరాడు..

నీ యశస్సుకై ... మరో ఉషస్సుకై..
జాగృతమై.. జనసంద్రమై వినిపించు..
వైపరీత్యాలను... విపరీతాలను
శోధనతో... సాధనతో ఛేదించు..
ప్రచండ భానుడిలా... ప్రజ్వలిస్తూ..
ఉత్తేజంతో.. ఉద్వేగంతో..
నిరాటంకంగా.. నిర్మొహమాటంగా...
జనజీవన స్రవంతిలో...
దుర్మార్గాలు.. దారుణాలు...ఖండిస్తూ..
మలుపెరగని బాటసారిలా..
కలంధారివై.. కవన కదనం సాగించు...





పళ్ళు లేని ఆ బోసినోటి నుంచే బూతులు స్వేచ్ఛగా సాగుతాయి. కొన్నాళ్ళ క్రితమే అతని భార్య పోయింది. ఇతర పడుపుగత్తెల్లాగే పోవడం గురించి ఆమెకేమీ తెలీదు. కానీ అక్కడ సహజాతముంది.

అప్పటికి ముసలాడి కింకా పళ్ళూడలేదు. రాత్రి వచ్చేది, వాళ్ళు పడకపై చేరేవాళ్ళు.

కుక్క బతుకులో అభినందించాల్సిన సంగతల్లా దానికున్న గొప్ప స్వేచ్ఛ!

తెల్లవారింది మొదలు చీకటి పడేదాకా సందుల్లో గొందుల్లో సంచరిస్తుంది. ఏదో దొరికింది కొద్దిగా తింటుంది. కాసేపు కునుకు తీస్తుంది. ఆడకుక్క వెనుక వాసన చూస్తూ ఏదో ఆరా తీస్తుంది. అందుకోసం చీకటి పడేదాకా కూడా ఆగదు.

ఒక స్త్రీ వీధిలోకి వచ్చి అటూ ఇటూ చూస్తూ ఆగింది. ఒక మత పెద్ద వెళుతూ ముందుకూ వెనక్కీ చూశాడు. బహిరంగ స్థలాల్లో ఏం జరగడానికయినా అవకాశముంది. స్త్రీ కావచ్చు కానీ ఒక పురుషుడి కళ్ళలో కళ్ళు పెట్టి చూడ్డానికి సిగ్గుపడుతుంది. కానీ ఒక కుర్రాడు ఆటలో మునిగి అసహనంగా అటు వేపు నుంచి వచ్చి రాళ్ళు విసిరాడు. ముసలాడికి ఒళ్ళు మండి బూతులు తిట్టాడు! ■



# "ట్రిపుల్ ఈ"



- శ్రీ రంగనాయకి వై.
సెల్: 9441095974

'కోటీ'నైనా ఆటబొమ్మగా కొనివ్వగలవాణ్ణి
నదులను తివాచీగ పరచగలవాణ్ణి
చందమామతో చాటింగ్‌ను చిటికెలో ఏర్పరచగలవాణ్ణి
ఈ పూట ఇదెక్కడి విడ్డూరం?
నా బిడ్డల ఏడుపు ఆపలేకుండా వున్నాను
ఏం రా పిల్లలూ.. ఏం కావాలని
లాలిస్తూ... బుజ్జగిస్తూ
చుబుకం ముద్దాడుతూ, అలకలు సరిచేస్తూ
అడిగాను
కొండమీద కోతినైనా తెచ్చివ్వగలననే!
అడిగాను
వాళ్ళన్నారు
ఆ నాన్నెవడో
దారాలతో సాలీడుగూడు తయారుచేసి
అందులో చచ్చిపోయిన సాలీడును అతకబెట్టి
తెలుగు వాచకంలోని
ఓర్పు పాఠం ఒప్పజెప్పినందుకు
కానుకగా వాడి పిల్లలకిచ్చాట్ట!
ఊర్లోకి సర్కసోడొస్తే..
చెరో భుజం మీద ఇద్దరు పిల్లల్ని ఎక్కించుకుని
చెమటను, కష్టాన్ని, ఆకలిని, చేదును
దగ్గరగా చూపించి
దొమ్మరోళ్ళను ఊరి చివరి దాకా సాగనంపుతూ
పలుగు పారలతో రాబట్టుకున్న రెక్కల కష్టాన్ని
ఐదు గాంధీ బొమ్మున్న పదులని
చెరో బిడ్డ చేత ఇప్పించి
తీగ మీద నడిచినోడి నోటిచేత
దండాలు బుల్లెమ్మగోరూ... దండాలు బుల్లెబ్బాయి గోరూ
దిక్కుల్ని దాటాల మీ అసుంటోళ్ళు
అనే దేవర దీవెనల్ని పొంది
ఆ నాన్నెవడో
వాడి గుడిసె చుట్టూ వాటిని అంటుకట్టాడట!
వాడి బాబులాటి వాటిని
ఎవరక్కడ అని తెప్పించగల నన్ను
ఇదెక్కడి పిచ్చగోల?!
గుండెలో హృదయాన్ని, బతుకులో తడిని
తెలియజేసిన పిచ్చోణ్ణి చూసి
ఈత గింజలిచ్చి తాటి గింజలు లాక్కునే నైజమున్న నన్ను
నువ్వూ... ఆ నాన్నలా కావాలీ
ఈ... ఈ... ఈ
ఇలా ఏడుస్తున్నారు
నే మర్చిపోయిన కన్నీళ్ళని నాకు గుర్తుచేస్తూ
ఈ పొద్దుటి పూట
ఇలా ఏడిపిస్తున్నారూ...
ఇట్టాగైతే
నా ఆస్తులేం గావాలి?! వాటి కోసం యంత్రమైన నేనేం గావాల?!

---



# సందిగ్ధత

"Search not a wound to deep
best thou make a new one"
*- Thomas fullor*

- మొహమ్మద్ ఖాన్
సెల్: 9440137475

కనిపించే దృశ్యాల కన్నా
కనీ కనిపించని దృశ్యాలే మనిషిని
వేధిస్తూ వెంబడిస్తుంటాయి
వినిపించే చరణాల కన్నా
వినీ వినిపించని శబ్ద తరంగాలే
మనిషిని, ఊహాలోకం వైపుకు నెట్టుకుంటూ పోతాయి
కలలకూ వాస్తవానికీ నడుమ
కవిత్వీకరించలేనంత వ్యత్యాసం వున్నట్లు
వాస్తవ అవాస్తవాల భేలే చల్తేహీ రహేగా!
మనిషి కనిపించే యధార్థాన్ని విడిచి
కనిపించని అబద్ధం కాని నిజాల్ని వెతుక్కుంటూ
ఎక్కడికో తను ఊహించని దిక్కుల వెంట నడుస్తూ పోతాడు
ఎదుట నున్న ప్రత్యక్ష సాక్ష్యాన్ని విడిచి
అదృశ్యంగా పరోక్ష స్థాయిలో
ఉన్నదో, లేదో తెలియని సందిగ్ధతే
మనిషిని ఆకట్టుకుని నడిపిస్తూ పోతుంది
మనిషి వర్తమానాన్ని జారవిడుచుకుని
గతాన్ని త్రవ్వుకుంటూ
భవితని ఊహించుకుంటూ
కుయుక్తముగా నడుచుట
సక్రమ మార్గ అన్వేషణ కానే కాదని ఎన్నిసార్లని చెప్పను?
గాలికి కొట్టుకుపోయే
విస్తరాకులతోనే చికాకు
ఒడ్డించిన విస్తరి హుందాగానే ఆహ్వానిస్తుంది
అన్నం మెతుకుల సాక్షిగా

అనువాద కథ

# సంకెళ్ళలో స్వప్నాలు




మళయాళ మూలం : ఎం.కె. చాంద్‌రాజ్

ఆంగ్లం : సుధీర్

తెలుగు : కొల్లూరి సోమశంకర్


ఓ క్రికెట్ వీరాభిమాని స్కోర్ బోర్డు కేసి కళ్ళార్పకుండా ఎలా చూస్తాడో, అనంతన్ కూడా అలాగే ఉన్నాడు. అతని దృష్టంతా వేదికపై ఉన్న నల్ల తెరపై గీయబడిన చతురస్రం పైనే వుంది. ఆ రంగు రంగుల, మెరుస్తున్న చతురస్రం వాళ్ళ జీవన స్వప్నాలకు చిహ్నం. ఆ కిక్కిరిసిన ఎ.సి. గదిలో ఉన్న ప్రతీ ఒక్కరికి ఓ కల ఉంది. ఆ చతురస్రం, నల్లతెర, కోటు - టై ధరించి ఉపన్యసిస్తున్న వ్యక్తి - ఇవన్నీ స్వప్నాల వెనుక పరుగుదీస్తున్న వారి మనసులలో అలజడిని సృష్టిస్తున్నాయి.

తమ విజయావకాశాలను గణించేందుకు వాళ్ళలో కొంతమంది పెన్నూ, పేపరు వాడుతున్నారు. వాళ్ళ అంకెలలో సున్నాలు మరిన్ని సున్నాలకి తావిస్తున్నాయి. ఎన్ని సున్నాలు పెరిగితే అంత ఎక్కువ డబ్బు వేలల్లోంచి లక్షల్లోకి, కోట్లలోకి పరుగెడుతున్నట్లుంది. బయట ఎండ మండిపోతోంది. కానీ లోపల మాత్రం వారంతా ఓ చల్లని స్వాప్నిక స్థితిలో ఉన్నారు.

లెక్కలు కట్టడానికి అనంతన్ తొందరపడలేదు. ఎందుకంటే అతనికి లెక్కల్లో ప్రావీణ్యం తక్కువ. కాలేజి స్థాయిలో అతను చరిత్ర చదువుకున్నాడు. కూడికలు వేయడంలో అతనెప్పుడూ తప్పులు చేస్తాడు. తన పాల వ్యాపారం లెక్కలు చూసే బాధ్యత తన భార్యపై మోపాడు. వ్యాపారంలో శారీరక శ్రమ అనంతన్‌దైతే, మేధస్సు మాత్రం అతని భార్య లలితది. పెద్దలిద్దరు, పిల్లలిద్దరు ఉన్న ఆ కుటుంబ జీవితం గడపడానికి తోడ్పడుతున్నది ఆ పాల వ్యాపారమే.

తన డిగ్రీ పట్టా ఏ ఉద్యోగం సంపాదించలేకపోయినప్పుడు అనంతన్‌కి పాల వ్యాపారం, ట్యూషన్లే దిక్కయ్యాయి. లలిత లెక్కలు, సైన్సు చెబితే, అనంతన్ మళయాళం, ఇంగ్లీషు చరిత్ర చెప్పేవాడు. ఇంగ్లీషు మీడియం బడులలో చదువుతున్న చుట్టుపక్కల పిల్లలకి ఇది ఓ వరమైంది.

ఈ నెలవారీ సమావేశాలకి హాజరవడం ఎంతో పరమానందం. ఎందుకంటే సమాజంలోని గొప్ప గొప్ప వాళ్ళతో కలసి కూర్చుంటాడు. అయిదంకెల కన్నా ఎక్కువ అంకెలలో జీతం పుచ్చుకునే వాళ్ళున్నారక్కడ. వ్యాపారస్తులు రాజకీయవేత్తలు. బ్యాంకు అధికారులు... భద్రన్ గారు చెప్పేది నిజమైతే కొందరు ప్రభుత్వ కార్యదర్శులు కూడా ఉన్నారట. సెక్రటేరియట్‌లో పనిచేసే భద్రన్‌గారి దయవలన ఇటువంటి విశిష్ట వ్యక్తులతో కలిసి అదృష్టం తనకే పట్టిందనుకుంటాడు అనంతన్.

ఇటువంటి ఓ సమావేశం ముగిశాక ఇంటికి వెళ్ళిన అనంతన్ భార్యతో అన్నాడు.

"నేను ఇప్పుడు ఏ స్థాయిలో ఉన్నానో నీకు తెలుసా డియర్. ఈ రోజు ఓ గొప్ప వ్యక్తి నా పక్కన కూర్చున్నాడు. ఓ పెద్ద మేడలాంటి కారులో మీటింగ్‌కి వచ్చాడు. ఆయన పక్కన కూర్చోవాలంటే కొద్దిగా సిగ్గేసిందనుకో.

అబ్బ. మీదెంత అదృష్టం. కానీ మీరక్కడికి వెళ్ళేటప్పుడు మీవెంట ఆ పాడు పెంట వాసనని మాత్రం మోసుకుపోకండేం. ఏదైనా సెంటు పూసుకెళ్ళండి. అప్పుడు సిగ్గు పడక్కర్లేదు.

"నాకు ఆ మాత్రం తెలియదేంటి? అందుకేగా ఆ ఫ్యాషన్ సెంటర్ నుంచి ఆ స్ప్రే కొనుక్కొచ్చింది."

తన భర్తని చూసి లలిత గర్వపడింది. ఇక నుంచి తాము మరింత మెరుగైన జీవితం గడపొచ్చు. ఆవుల మధ్య గడుపుతూ, వాటితో తాపులు తినడం ఎంత దుర్భరం! ఇదీ ఇప్పటి వారి జీవితం. అనంతన్ ఇప్పుడిప్పుడే పెద్దవారి సాంగత్యంలోకి వెడుతున్నాడు. కొత్త వ్యాపారం కలిసొస్తే లాభాలందుకోవచ్చు. అప్పుడీ పాల వ్యాపారం, ట్యూషన్లు మానేయవచ్చు. పైగా అలాంటివాటికి ఇకపై అసలు సమయమే ఉండకపోవచ్చు.

...

"అనంతా, ఈ ఫారం నింపివ్వు?"

"కానీ, సార్ దీనికి అయిదువేల రూపాయలు అవసరం అన్నారుగా..."



"ఫర్వాలేదు అనంతా, ప్రస్తుతానికి రెండున్నర వేలు కట్టు. మిగతాది రెండు వారాల్లో కడుదూ గానిలే. నేను సర్దుతాను" అన్నారు భద్రన్.

ఆ స్కీమ్‌లో అనంతన్ చేరడమంటే గొప్ప సిరి పట్టడమేనని భద్రన్ గారి అభిప్రాయం. ఆయన పట్టుదల వల్లే అనంతన్ ఈ స్కీమ్‌లో చేరాడు. ఈ కంపెనీ వారి ప్రధాన కార్యాలయం ఏదో పరాయి దేశంలో ఉందట.

"ఈ ఫారం నింపి, డబ్బు కట్టేయ్ అప్పుడు నువ్వు ఈ పథకంలో సభ్యుడైపోతావు. నువ్వు ఎంత మందినైనా సభ్యులిగా చేర్పించవచ్చు. నువ్వెంత మందిని చేర్పిస్తే వారు కట్టే మొత్తంలో నీకు కొంత వాటా కమీషన్ వస్తుంది. నువ్వు చేర్పించిన వాళ్ళు ఇంకొంతమందిని చేర్పిస్తే అందులో కూడా నీకు కొంత డబ్బొస్తుంది ఈ విధంగా. నీకొచ్చే డబ్బు రెండింతలు, మూడింతలు అవుతుంది. నువ్వెంతో ఎదిగిపోతావ్. నీ వృద్ధి ఎప్పుడూ ఆగిపోదు."

"అయితే కేవలం అయిదువేల రూపాయలు పెట్టుబడితో... మాకొచ్చేది..."

"నీకొచ్చే ఆదాయానికి పరిమితి లేదయ్యా. ఈ గొలుసు పెద్దదైన కొద్దీ. నువ్వు యాభై వేల నుంచీ, అయిదు లక్షల వరకు... ఇంకా కుదిరితే కోటి రూపాయల వరకు సంపాదించవచ్చు. ఎందుకంటే వ్యవహారం అంతా కంప్యూటర్ పైనే జరుగుతుంది. లెక్కలన్నీ సరిగ్గా ఉంటాయి."

భద్రన్ గారు చెప్పే అంకెలను అనంతన్ కలలో కూడా ఊహించలేదు. కొన్ని క్షణాల పాటు అతనికి నోట మాట రాలేదు.

ఓ రోజు మెంబర్‌షిప్ ఫీజులో మిగతా భాగం కట్టిన తర్వాత అనంతన్ ఇంటికొచ్చాడు.

"ఈ రోజు తాకట్టు పెట్టిన నగలు మనం తొందరలోనే విడిపించుకోవచ్చుంటారా? అడిగింది లలిత.

"తప్పకుండా. నెలరోజుల లోపలే మనకు లాభాలు రావడం మొదలవుతుందని భద్రన్‌గారు చెప్పారు. రేపు నువ్వా బ్యాంకులో పనిచేసే కృష్ణమూర్తిగారింటికి పాలుపోయడానికి వెళ్ళినప్పుడు ఈ స్కీమ్ గురించి చెప్పి, ఇందులో చేరమను."

"ఏం ఫర్వాలేదు. నేనూ కొందరికి చెప్పాను. నా ట్యూషన్‌కొచ్చే అశ్విని తెలుసుగా. వాళ్ళ అమ్మ, ఇంకో ఇద్దరు ముగ్గురు చేరతామని మాటిచ్చారు."

"శభాష్ తెలివైన పనిచేశావు మన బంధువులు, స్నేహితుల నుంచీ కనీసం ఇరవై మందినైనా చేర్పించాలి. అప్పుడే మనం ఈ పథకంలో కొనసాగగలం. ఈ గొలుసు తెగనంత కాలం మనకి లాభాలొస్తాయి."

...

మీటింగ్ ముగిసింది. అందరూ హాల్లోకి వచ్చారు. ఓ పెద్ద ఉత్సవం తరువాత ఎవరిళ్ళకి వారు వెడుతున్నట్లుగా ఉందా వాతావరణం. దూరప్రదేశాల నుంచి వచ్చిన వాళ్ళు టాక్సీలలోనూ, వ్యాన్లలోను బయల్దేరారు. ఖద్దరు దుస్తులేసుకుని అనంతన్ పక్కన కూర్చున్నతను తన ఖరీదైన కొత్త కారులో దర్జాగా వెళ్ళిపోయాడు. అనంతన్ తన సైకిల్ ఎక్కుతూ భద్రన్ గారు స్కూటర్‌పై వెళ్ళడం చూశాడు.

కొన్ని క్షణాల తర్వాత అనంతన్ ఓ ఖరీదైన ఎసి కారు నడుపుతున్నాడు. కారు స్టీరియో నుంచి వస్తున్న సంగీతం అతడి మనసుని ఆక్రమించింది.

"అనంతా, ఎక్కడికి ఎగిరిపోతున్నావు?"

అనంతన్‌కి ఏమీ వినిపించలేదు. రోడ్డుపై ఉన్న చెట్ల నుంచి వచ్చే చల్లని గాలిని ఆస్వాదిస్తూ కారు నడుపుతున్నాడు. అతని పక్కన లలిత, పిల్లలు కూర్చుని జోకులు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు.

"అనంతా, ఎందుకా వేగం? అంత వేగంగా వెడితే నిన్ను దేవుడే కాపాడాలి. ఏం ఈ పూట ఇంకా పాలు పితకలేదా? అని ఖాదర్ ప్రశ్నించడంతో వర్తమానంలోకి వచ్చాడు అనంతన్.

ఇలా హఠాత్తుగా కారులోంచి సైకిల్ మీదకి రావడం కష్టంగా ఉంది అనంతన్‌కి. ఆ భావాన్ని ముఖంలో వ్యక్తం కాకుండా జాగ్రత్తపడి "లేదు, ఖాదర్‌భాయ్ వేరే పని మీద వెడుతున్నాను. మళ్ళీ కలుద్దాం అంటూ తన ప్రయాణాన్ని కొనసాగించాడు. ప్రస్తుతం కారు గురించి ఆలోచించే స్థితిలో లేడతను.

...

ఓరోజు పొద్దున్నే అందరికీ పాలు పోసి అనంతన్ ఇంటికి వెడుతుంటే దారిలో శిశుపాలన్ అతడిని అడ్డగించాడు.

"అనంతా నెలరోజులు పూర్తయ్యాయి. మనకి డబ్బులు రావాలి కదా?" అని అడిగాడు.



శిశుపాలన్ అనంతన్‌కి దూరపు బంధువు. అనంతన్ ఒప్పించడంతోనే అతను కూడా అయిదువేల రూపాయలు కట్టి ఈ స్కీములో చేరాడు.

"అన్నా మనకి రావల్సిందంతా వెంటనే పంపిస్తామని కిందటి సమావేశంలో చెప్పారు. విదేశీ కార్యాలయం నుంచి వచ్చిన డాలర్లను మన రూపాయలలోకి మార్చడంలో కొంత ఆలస్యం అవుతోందట..."

నిజానికి ఆ సమావేశంలో వీళ్ళ వాటా డబ్బుల గురించి ఏమీ చర్చించలేదు. భద్రన్‌గారు అనంతన్‌కి అలా చెప్పారు. శిశుపాలన్‌ని నమ్మించడానికి అనంతన్ అవే మాటలు అతనికి చెప్పాడు.

భద్రన్‌గారు మరో స్కీములో పదివేల రూపాయలు పెట్టుబడి పెట్టారని, ఆ పథకం నిర్వాహకులు జనాలని నిండా ముంచేశారని అనంతన్ ఇటీవల విన్నాడు. దీనిగురించి భద్రన్ గారిని అడిగితే, "నా డబ్బులు పోయాయని ఎవరన్నారు? అలా డబ్బులు తీసుకొని ఎవరూ మాయమైపోలేరు. కొత్త ఆర్థిక విధానం ప్రవేశపెట్టడం వలన వ్యాపారం కొంత మందకొడిగా ఉంది. కానీ నా డబ్బులు నాకు ఏ క్షణంలోనైనా వచ్చేస్తాయి" అని కోతలు కోశాడాయన.

తను కూడా ఇటువంటి ఓ స్కీములో డబ్బులు కట్టి మోసపోయినట్లు సమావేశంలో కలిసిన ఓ బ్యాంకు ఉద్యోగి అనంతన్‌కి చెప్పాడు. అయితే అతని ఉద్దేశం ప్రకారం ఇంత పెద్ద గొలుసు వ్యాపారంలో అయిదు వేల రూపాయలు చాలా చిన్న మొత్తం. అదే ఓ కొత్త వ్యాపారం మొదలుపెట్టాలంటే లక్షల రూపాయలు అవసరం. ఇటువంటి స్కీములకున్న గొప్ప ఉపయోగం ఇదేనని అతనన్నాడు.

అనంతన్‌కి నిజమేననిపించింది.

...

ఓ రోజు స్వప్నావస్థలో అనంతన్ తన పశువుల కొట్టానికి వెళ్ళాడు. అది ఖాళీగా కనిపించింది. తమ ఆవు కల్యాణిని నిన్ననే ఓ శెట్టికి అమ్మేసారన్న సంగతిని లలిత అనంతన్‌కి గుర్తు చేసింది.

అది నిజం. అనంతన్‌గారి బంధువు శంకరన్‌గారి అమ్మాయికి పెళ్ళి కుదిరింది. ఈ గొలుసు వ్యాపారంలో బాగా ముదుతుందని అనంతన్ ఆయనని నమ్మించి చేర్పించాడు. రెండు నెలలు గడిచినా, అనంతన్ చెప్పినట్లుగా ఆయనకి లాభాల్లో వాటా ఏమీ అందలేదు. దాంతో ఆయన పరుషంగా మాట్లాడాడు. ఆయన్ని సమాధానపరిచేందుకు అనంతన్ తమ ఆవును అమ్మేసి వచ్చిన డబ్బుని ఆయనకి సర్దాడు.

ఇప్పుడిక వాళ్ళకి ఒక్క ఆవు కూడా లేదు.

కానీ కొత్త వ్యాపారం ఉంది కదూ?

అనంతన్ భద్రన్ గారికి ఇదంతా చెబితే ఆయన నవ్వేశారు.

"అనంతా, మొదట్లో కొన్ని సమస్యలుంటాయి. ప్రతీ వ్యాపారంలోనూ అంతే. మనకి మన డాలర్లు రావడం మొదలైతే అన్నీ సర్దుకుంటాయి. నువ్వు చేయాల్సిందల్లా హాయిగా కాళ్ళు చాపుకుని కూర్చుని డబ్బు లెక్కపెట్టుకోవడమే."

తియ్యని కబుర్లు చెప్పడంలోనే భద్రన్‌గారి నైపుణ్యం అనంతన్‌కి భరోసానిచ్చింది.

కానీ ఈ మధ్య భద్రన్‌గారిని కలుసుకోవడం కూడా కష్టంగా వుంది. తన సందేహాలు తీర్చుకోవాలని అనంతన్ వెళ్ళినప్పుడల్లా భద్రన్‌గారి భార్య ఆయనింట్లో లేరని చెబుతోంది.

తెల్లారగట్లే వెడితే, భద్రన్‌గారింకా నిద్ర లేవలేదంటోంది. తర్వాత వెడితే ఆఫీసుకి వెళ్ళిపోయారని చెబుతోంది. సాయంత్రం కలుద్దామా అంటే ఆయనేమో బాగా చీకటి పడితే గానీ ఇంటికి రావడం లేదట.

పోనీ అర్ధరాత్రి వెడితే? అమ్మో తనని దొంగగానో లేదా రహస్య ప్రేమికుడుగానో జనాలు భావించారంటే అంతే సంగతులు...

ఈ వ్యాపారం ప్రారంభమై చాలా రోజులు గడిచిపోయాయి.

అనంతన్ ఈ పథకంలో చేర్పించిన వాళ్ళందరూ ఇంటిపై వచ్చి కూర్చుంటున్నారు. లాభాల మాట అటుంచి, తాము పెట్టిన అసలు మొత్తాన్నైనా తిరిగి ఇవ్వమంటూ గొడవ చేస్తున్నారు.

# శబ్దం

- ఈతకోట సుబ్బారావు
సెల్ : 94405 29785



ఆకాశమంతా కలిపితే
నా కనుపాపంతే
మంచు బిందువులో సముద్రాన్ని
దర్శించుకున్న తర్వాతట్నించీ
కిసలయ రాగంతో
బతుకు పల్లవి ప్రారంభించాను
నిప్పు పడగల్ని, ముళ్ళ వంతెనల్నీ
దాటగలిగితే పాటకి జీవితం
నడక కల్యాణిలోనో కాఫీలోనో
సరిగమల గురించి కాదు కాని
అధర జలదంపై చమ్కీ తీగ శంపాలత
సంగతులై జలదరిస్తుంటుంది
మౌనాన్నంతా పిండి
మాటల తేనెముంతలో కలగలుపుతాను
ఒక కొత్త ప్రపంచగానం
నా ఎదను తామ్రపత్రం చేస్తుంది
నది అద్దంలో మేఘం
తొంగి చూసుకునే ఆనందం
మాటో పాటో పలకరించిన పులకరింత
నిశ్శబ్ద సముద్రాన్ని విచ్ఛేదం చేస్తుంది
చినుకుల తాళానికి
అలల జలతరంగిణి
అడుగుల నడకై కదులుతుంది
శబ్దాన్ని నాదమంటావో చైతన్యమంటావో
సుప్త జీవితానికి
సుప్త సముద్రాలంత చలనం
శబ్ద సౌందర్యంతోనే!

---

అనంతన్‌కి రాత్రిళ్ళు నిద్రపట్టడం లేదు. కళ్ళు మూసుకుంటే, కర్రలు పట్టుకుని తరుముతున్న జనాలే కళ్ళముందు కనబడుతున్నారు. అంతే ఒక్కసారిగా కళ్ళు తెరచి, కోడి కూసేదాకా మెలకువగానే ఉంటున్నాడు.

లలితది మరో పరిస్థితి. ఓ పుస్తకంలో ఏవో లెక్కలు వేస్తోంది. కొన్ని అంకెలు కలుపుతోంది. కొన్నింటిని తీసి వేస్తోంది. కొన్ని హెచ్చిస్తోంది. కొన్ని భాగాహారాలు చేస్తోంది. ఆ తర్వాత ఆ కాగితాన్ని చించి ఉండలా చుట్టి పెరట్లోకి విసిరేస్తూ వుంటుంది. మళ్ళీ ఇంకో కాగితంపై రాయడం మొదలు పెడుతుంది.

“అమ్మా, నువ్వు లెక్కలు నేర్చుకుంటున్నావా? లేకపోతే ట్యూషన్ పిల్లల్లో ఎవరిదైనా హోంవర్క్ నువ్వు చేస్తున్నావా?” కూతురు సరదాగా అడిగిన ప్రశ్నకు బదులుగా ఆమె తొడపై చాచిపెట్టి కొట్టింది లలిత. చేతి వేలి ముద్రలు ఎర్రగా పడేటట్లు.

అనంతన్‌కి మాటలతో బురిడీ కొట్టించడం రాదు. తనని ప్రశ్నించే వారికి సరైన జవాబులు ఇవ్వలేకపోయేవాడు.

అందుకని వీలైనంత వరకు ఇంటికి రావడం మానేశాడు.

పాఠాలు చెప్పడం తగ్గిపోయింది. పిల్లలు రావడం మానేశారు.

అనంతన్ కోసం ఇంటికొచ్చే వారికి సమాధానం చెప్పలేక తల ప్రాణం తోకకొచ్చేది లలితకి. పిల్లలకైతే నాన్న కనబడి రోజులు గడిచాయి. అర్ధరాత్రి సమయం గడిచాకా. లలిత నిద్రలో జోగుతున్నప్పుడు ఇంటికొస్తాడు అనంతన్. నాలుగు ముద్దలు మింగి నిద్ర పోతాడు. సూర్యుడు ఉదయించక ముందే. లలిత, పిల్లలు నిద్రలేవక ముందే ఇల్లు విడిచి వెళ్ళిపోతాడు.

ఓ రోజు పరిస్థితులు భరించలేనివిగా మారినప్పుడు...

“దాక్కునేందుకు నాకూ పిల్లలకి కూడా ఓ స్థలం చూపించకూడదూ?” అని అడిగింది లలిత.

అనంతన్ తలవంచుకొని కూర్చోలేకపోయాడు.

ఆ ప్రశ్న అతని మనసులో తేనె తుట్టెని కదిపింది. నిద్రపోవాలని ప్రయత్నించినప్పుడు అతనికి కళ్ళు మూతపడటం లేదు.

భార్యా, పిల్లల కేసి చూశాడు. వాళ్ళు మంచి నిద్రలో ఉన్నారు. వాళ్ళకి నిద్రాభంగం కలగకుండా, ఇంట్లోంచి బయటకి నడిచాడు.

అది వెన్నెల రాత్రి. చాలా రోజులుగా అతను తన సైకిలు నడపటం లేదు. సైకిలెక్కి గబగబా రోడ్డు మీదకి వచ్చాడు. వీలైనంత వేగంగా తొక్కసాగాడు. కొంత సమయం గడిచాక, అతనికి కాల స్పృహ పోయింది. అయినా అతనికి అలసటగా అనిపించలేదు.

దారిలో అతనికి గోవిందన్ కుట్టి కనిపించాడు.

“ఓయ్ అనంతా. ఎందుకంత వేగం? దారంతా దిగుడు కదా. అసలే నీ సైకిల్ బ్రేక్స్ బాగుండవు. జాగ్రత్త. రోడ్డు చివర. అడుగే తెలియని పెద్ద లోయ...” అంటూ హెచ్చరించాడు.

“పర్వాలేదు గోవిందన్ కుట్టీ. నేను వేగంగా వెళ్ళాలి.. ముఖ్యంగా నేనీ ప్రాంతం నుంచి పారిపోతున్నప్పుడు...” అంటూ మరింత గట్టిగా తొక్కసాగాడు.

కొంచెం దూరంలో లలిత, పిల్లలు, నిల్చుని ఉన్నారు. వాళ్ళు అనంతన్‌ని చూడగానే చేతులు ఊపారు.

ఆగాలా వద్దా అని ఓ క్షణం పాటు సంశయించాడు అనంతన్. ఆ తర్వాత బ్రేకులు నొక్కాడు. వాళ్ళు కూడా సైకిలెక్కారు. ఒకరినొకరు గట్టిగా పట్టుకుని కుటుంబం ముందుకు సాగింది.

అనంతన్ సైకిలిప్పుడు బాణంలా దూసుకుపోతోంది.

సంకెళ్ళ నుంచి స్వప్నాల నుంచి విముక్తులైన అనంతన్, లలిత, పిల్లలు తమ ప్రయాణాన్ని కొనసాగించారు... ■

# తూర్పు అద్దం



**- శైలజామిత్ర**

తూర్పు అద్దంలో ముఖం కనబడేసరికి
నింగి నేలలు మనో తీరాలను చుట్టుకున్నాయి
దేహం మీద పడినవి రాళ్ళు ముళ్ళు అయితే
మనసును కలలు కన్నీళ్ళు ఆక్రమించుకున్నాయి
ఆ సమయంలో నేను సమర్పించిన
ఆత్మ నిరసన పత్రం నీ పరిచయం..
ఆలోచనల చుట్టూ అమృత భావన చిత్రాలయితే
చివరకు ఆ స్థితి శకలాలను మిగిల్చింది
ఆకాశానిదే అసలు తప్పంతా..
అవని పట్ల పక్షపాతం చూపింది
ఆశించకుండానే తీవ్రమైన ఆకర్షణలకు గురిచేసింది
తనది కానీ కాంతి వర్షానికి అలవాటు చేసింది
మర మనుషుల్ని పూబంతుల్ని చేసింది
ఈ మాత్రం ముందుచూపు లేకుండా
జీవితాన్ని రసానుభూతులకే పరిమితం చేసింది
గంభీరమైన తమస్సులలో చిట్టచివరి శ్వాసగా
రాత్రిని మాటల వెన్నెల్లో ముంచింది
ఒకచోట దట్టంగా మరోచోట పలచగా ఉండే అడవి
కాలంతో పాటు ముందుకు నడిచేలా
ధూర్తుల అడుగులకు అలవాటు పడేలా చేసింది
ఎన్నాళ్ళ చరిత్రో కదా ఇది...
ఆది అంతం, ఆనవాళ్ళే లేకుండా అవతరించింది
సృష్టి లయలకు హేతువులై నిలిచిన అంతస్తుల్ని
రక్తసంబంధాలతో పర్యావలోకనం చేస్తూ
జీవాల్ని సైతం జంతు చర్మాలతో కప్పి
అవహేళనలకు జ్యోతి ప్రతీకలుగా నిలిపింది
ఇక ఇపుడు
అహంకారం, గాడాంధకారం అలుముకున్న
సమాజావరణలో దివ్యమైన అనుభూతుల్ని
నిరాశామయమై మృత్యువును ఆశ్రయిస్తోంది
ఆశ శబలితమయినది
ఆశయాన్ని 'మాయ' కమ్మింది
లిప్తపాటు కన్ను తెరవగానే శూన్యం ఎదురయింది
అదే నయం...
నేను ఉన్నంత వరకు నాతోనే ఉంటుంది..!!

# నానీలు



**- కందిపాటి గోపాలరావు**

సెల్ : 9652174640

గరికనౌతానంటే
వద్దంటుందా నేల

పొలాలన్నీ
స్థలాలౌతున్న వేళ

గిరిజనుడికైతే
తప్పదు గురి

అక్షరాన్ని చేద్దామా
అమ్ములపొది

కాసే కాపులో
వేరుకీ షేరుంది

అట్టడుగునున్న
హక్కెక్కడికి పోతుంది

"స్లిమ్‌నెస్"కి దక్కని
ఆస్కారు
'స్లమ్'కి దక్కింది
మురికీ మంచిదే

పచ్చని పైరే
ఎగరేసిన పార్టీ జెండా
పట్టెడన్నమే
రైతన్న అజెండా

# వైద్య సమరం



**- జి. నరసింహమూర్తి**

సెల్ : 9885379219

డాక్టర్ వెయిటింగ్ రూంలో
కాలం రోగిని రుబ్బుతోంది
రోగం
ఇతర ఇంగ్రిడియన్స్‌తో కలిసి
చెప్పుకోలేని బాధగా మారుతోంది
లార్వాలా పడి ఉన్న రోగం
డైనోసార్‌గా మారుతోంది
డాక్టర్ కారుణ్యం
తెల్లకోటు చాటున
వ్యాపారం ప్రారంభించింది
అతను రాసే ప్రిస్క్రిప్షన్
పాములా బుస కొడుతోంది
డయాగ్నస్టిక్ టెస్టులు
అవుతున్నాయి
కొండ చిలువలు
మందుల
మారణహోమంలోంచి
బతికి బయటపడితే
మళ్ళీ ఓ సరికొత్త రోగంతో
జ్ఞాపకాల
ఈగల్ని తోలుకుంటూ
మరో వైద్య సమరానికి
అదే వెయిటింగ్ రూంకి
తన అస్థిపంజరాన్ని
తనే మోసుకొస్తాడు

కథ

# ప్రమాదం




- డా॥ ఉప్పలధడియం వెంకటేశ్వర

**"పోరా, పో "గట్టిగా కసురుకొన్నాడు గురవయ్య."**

**గురవయ్యకు యాభై ఏళ్ళుంటాయి. పొడుగ్గా, నల్లగా ఉంటాడు. కాయకష్టంతో రాటుతేలిన ఉక్కు శరీరం. కళ్ళెప్పుడూ చింతనిప్పులు కురిపిస్తూ ఉంటాయి. గొంతులో మార్దవం రాకుండా జాగ్రత్త పడుతుంటాడు. నిక్కచ్చిగా లేకపోతే ఈ లోకంలో నెగ్గుకు రాలేమని అతడి అవగాహన.**

చాలాకాలం నుంచీ అక్కడే ఉంటున్నా... గురవయ్య గురించి లోకులకు తెలిసింది తక్కువ. అతడికి పరిచయస్తులు చాలామంది ఉన్నారు గానీ సన్నిహితుడంటూ ఒక్కడైనా లేడు. తమ స్వస్థలం సేలం అనీ, చెడి చెన్నపట్నం చేరిన కుటుంబాల్లో తమదీ ఒకటని చెబుతున్నప్పుడు మాత్రం అతడి కంఠం గద్గదమవుతుంది. గత స్మృతులు జ్ఞప్తికి వచ్చినప్పుడు చెమ్మగిల్లని హృదయం ఉంటుందా?

అతడు తల్లిని ఎరుగడు. తండ్రి పోయాక ఆదరించిన నాథుడు లేడు. తండ్రి దగ్గర్నించీ అతడికి పిత్రార్జితంగా వచ్చింది మూడడుగుల నేల మాత్రమే. అయితే నేం, అది అతడికి బ్రహ్మాండంతో సమానం.

అలాంటిది, తన కోటలో మరొకడు పాగా వేయాలని ప్రయత్నిస్తే గురవయ్య ఊరుకొంటాడా?

"పొమ్మంటే నీక్కాదూ, ఇంకో నిమిషం ఇక్కడుంటే తోలు వొలుస్తా..." గుర్రుగా చూస్తూ బూతుల్లోకి దిగిపోయాడు.

ఎదురుగా, నిలువెత్తు దైన్యంలా కనిపిస్తోన్న ఎనిమిదేళ్ళ సుబ్బిగాడు గుడ్లలో నీళ్ళు కుక్కుకున్నాడు. గొంతు తడారి పోయింది. మాట పెగలడం లేదు.

వాడు లారీ నుంచి దిగినప్పుడు రెండు గంటలు. చిమ్మచీకట్లో చుట్టూ చూశాడు. గుండెల మీద చెయ్యేసుకొని గుర్రు పెట్టి నిద్రపోతున్న గురవయ్యను కాసేపు పరకాయించి చూశాడు. అటూ ఇటూ తిరిగి అతడి పక్కన పడుకొన్నాడు. లేచాక అతడికి తన కథంతా చెప్పుకొంటే తప్పకుండా జాలిపడి ఆశ్రయమిస్తాడని అనిపించింది. తన ఒంటి మీద ఎవరిదో చెయ్యి పడ్డట్లు అనిపించి హఠాత్తుగా నిద్రలేచిన గురవయ్య. తన పంచన పడుకొన్న కుర్రాడ్ని చూసి అగ్గిమీద గుగ్గిల మయ్యాడు. వాడి వీపు మీద ఒక్కటిచ్చాడు. అప్పట్నుంచీ ఎంత బతిమాలుకొంటున్నా ఏడీ, అతడు వినేలా లేడే!

ఎలాగోలా ధైర్యం కూడగట్టుకొని "అయ్యా, నన్ని పొమ్మనక, నాకు ఓరుమే లేదు" అన్నాడు జీరవోయిన గొంతుతో.

గురవయ్య వాణ్ణో మారు ఎగాదిగా చూశాడు.

డీలా పడ్డట్టు కనిపిస్తున్నా, చాకులాంటి కుర్రాడని తెలుస్తూనే ఉంది. పాపం! ఏ ఊరి వాడో, ఎవరి పిల్లాడో! ఏ పరిస్థితుల్లో ఇలా వచ్చాడో!

పీక్కుపోయిన మొగం చూస్తోంటే, నిన్నంతా తిండి తినలేదనిపిస్తోంది. తైల సంస్కారం లేని జుట్టు, చింపి గుడ్డలు, దుమ్ము గొట్టిన శరీరం – అతడి వాలకం చూస్తోంటే ఎంతటి కఠిన చిత్తమైనా కరిగిపోవలసిందే.

గురవయ్య కూడా జాలి పడ్డాడు.

"నీ తోడ్తనె ఉంటును పనులన్ని మె లెస్స చేస్తును" అన్నాడు సుబ్బిగాడు గురవయ్య కరుగుతున్నాడని గ్రహించి.

అమాయకత్వమూ, గడుసుదనమూ కలగలిసినట్టు వాడు మాట్లాడుతుంటే గురవయ్యకు ముచ్చటేసింది.

అప్పటికి అరగంట నుంచీ కుర్రాడు ప్రాధేయపడుతున్నాడు.

"ఇంకా పూర్తిగా తెల్లవారలేదు."

పొద్దునే నాలుగ్గంటలకే లేవడం గురవయ్యకు అవసరం నేర్పిన అలవాటు. కాలకృత్యాలు తీర్చుకోవాలంటే కిలో మీటరు దూరం పోవాలి. జనావాస ప్రాంతంలోనే, వినియోగంలో లేని పాత స్మశానం అతడి అవసరాలకు సరిపోతుంది. ఎదురుగా గొట్టపు బావి ఉంది. అక్కడే అయిదు గంటలకు ముందే స్నానం చేసి వచ్చేస్తాడు. అయిదు దాటితే జనసంచారం మొదలవుతుంది, ఎవరో ఒకరు తిట్టిపోస్తారు.




రైల్వే స్టేషన్ దగ్గర ప్లాట్‌ఫారం మీద మూడడుగుల జాగా అతడిది. సేలం వదిలి వచ్చాక తండ్రి అక్కడే కూచుని ఏవేవో వస్తువులు అమ్మేవాడు. ఎక్కడ్నుంచి తెచ్చేవాడో తెలియదు గానీ అలా వస్తువులు తీసుకు రావడానికి వెళ్ళేటప్పుడు చాలా జాగ్రత్తలు చెప్పి వెళ్ళేవాడు. ముఖ్యంగా తాను తిరిగి వచ్చేవరకు ఆ స్థలం విడిచి క్షణమైనా ఎక్కడికి వెళ్ళవద్దని మరీ మరీ చెప్పేవాడు. గురవయ్యను బళ్ళో వేశాడు గానీ అతడికి చదువబ్బ లేదు. కొంత కాలం తండ్రికి చేదోడు వాదోడుగా ఉన్నాడు. తండ్రి కాలం చేయడంతో తోడూ నీడా లేని వాడయ్యాడు. రోజులు తరబడి పస్తే, కాగితా లేరాడు, బోకులు కడిగాడు, చేయని పనంటూ లేదు. కొద్దిరోజులు తాపీ మేస్త్రీ దగ్గర పనిచేశాడు. ఏం చేసినా, ఆ చోటు మాత్రం వదల్లేదు.

అతడ్ని అక్కడ్నుంచి వెళ్ళగొట్టాలని ఎంతోమంది ప్రయత్నించారు. జీవన్మరణ సమస్యగా భావించి మొక్కవోని ఆత్మస్థైర్యంతో ఎదుర్కొన్నాడు. అన్ని ప్రయత్నాలనూ వమ్ము చేశాడు. మొండివాడు రాజు కన్నా బలవంతుడు కదా.

కాలం గడిచే కొద్దీ, తాను పనిమీద వెళ్ళి వచ్చేలోపు, ఎవరైనా తన గూటిని ఆక్రమించుకొంటారేమోననే భయం పట్టుకొంది. అంతే! ఎక్కడికీ వెళ్ళకుండా, అక్కడే ఉంటూ వడలూ, బజ్జీలూ అమ్మడం మొదలు పెట్టాడు. 'తనస్థలం పట్ల ప్రతి ఒక్కరికీ మమకారం ఉంటుంది కదా!

పోనీ, చేరదీస్తే, తనకు మాత్రం ఎవరున్నారని! అనుకున్నాడు గురవయ్య.

అంతా క్షణకాలమే! ధక్కా మొక్కీలు తిని రాటుతేలిన మనిషి గురవయ్య.

"ఊహూ! జాలిపడితే చంకెక్కుతాడేమో! ఏకుమేకై కూచుంటాడేమో! ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు? పైపెచ్చు తాను ఆపై అరచి కోడై కూస్తున్నా లెక్క చేయకుండా ఇక్కడే ఉన్నాడంటే, అబ్బో కుర్రాడ్ని నమ్మలేం" అనుకున్నాడు ఎవరి మీదా నమ్మకం లేని గురవయ్య.

"నేను మళ్ళీ వచ్చేలోపు నువ్వు చుట్టుపక్కల ఎక్కడా కనిపించకూడదు, తెలిసిందా?" గద్దించాడు.

అప్పటికి సుబ్బిగాడు కదల్లేదు. ఆశ చావక అక్కడే నిలుచున్నాడు. ఏదో చెబుదామని గొంతు విప్పబోతున్నంతలో.

గురవయ్య ఒక్క ఉదుటున అతడి రెక్కపుచ్చుకొని బిరబిరా లాగాడు. సుబ్బిగాడు గింజుకుంటూ 'ఇది ప్లాట్‌ఫారం, నీ బాబు సొమ్మేం కాదు నన్ను పొమ్మనడానికి' అన్నాడు ఉక్రోషంతో.

కోపంతో ఊగిపోయాడు గురవయ్య.

డొక్కలో తన్ని 'మళ్ళీ వొస్తే తగలేస్తా' అంటూ వీధి చివరిదాకా లాక్కెళ్ళిగానీ వదల్లేదు.

గురవయ్య కాలకృత్యాలు తీర్చుకొని వచ్చేసరికి మామూలు కన్నా కాస్త ఆలస్యమైంది.

ఆకాశం రక్తవర్ణం పులుముకొంది.

విద్యుత్ తీగల మీద కాకులు అదే పనిగా అరుస్తున్నాయి. కుక్కలు విరామం లేకుండా మొరుగుతూనే వున్నాయి.

ప్లాట్‌ఫారం చివర్న జనం గుమి కూడి ఉండటం గమనించాడు గురవయ్య. అప్రయత్నంగానే అక్కడికి చేరుకున్నాడు.

ఆ సందు హైరోడ్డును కలిసే చోట, ప్లాట్‌ఫారం మలుపున –

సుబ్బిగాడు నెత్తుటి మడుగులో గిలగిలా కొట్టుకొంటున్నాడు, శ్లేష్మంలో ఈగలా.

"ఆడ్నా పండుకొనేది, లారీలు గుద్దేయవా" అంటున్నారెవరో.

'పిల్లోడు సిటీకి కొత్త వేల ఉండాది, పాపం ఎవరి బిడ్డనో ఏమో!' అని మరో తడి గొంతు.

కడుపులో పేగు కదిలినట్లయింది గురవయ్యకు.

సుబ్బిగాడి కేసి చూశాడు. మరో రెండు నిమిషాలు వాడలా కొట్టుకొని ప్రాణం విడిచాడు.

వాడి చూపు తన మీద తాపడమైనట్లనిపించి ఒళ్ళు జలదరించింది గురవయ్యకు.

చుర్రుమంటున్న సూర్యకిరణాలు తనను పొడుస్తున్నట్లనిపించింది.

గుండెల్లో ఎవరో చెయ్యి పెట్టి మెలి తిప్పుతున్న భావన.

కళ్ళు బైర్లు కమ్మాయి. మరుక్షణం అక్కడే కూలిపోయాడు.

●

# ఆకాశమంత ఆకలి సీమకు గాయం

- డాక్టర్ రాధేయ
సెల్ : 9985171411




సాహిత్య సృజన ఆయా ప్రాంతీయ, భౌగోళిక, సామాజిక నేపథ్యాల ననుసరించే జరుగుతూ వుంటుంది. ఆ తపన సాహిత్యంలో ప్రతిఫలిస్తూ వుంటుంది. జీవిత చైతన్యంతో, భాషా చైతన్యంతో కవిత్వం వచ్చింది. స్వాతంత్ర్యానంతరం రాయలసీమ నుంచి గొప్ప ఆధునిక సాహిత్యం రావడానికి కారణం రాయలసీమ రచయితలు తమ వెనుకబాటుతనాన్ని గుర్తించడమేనని మనం అంగీకరించాలి.

చారిత్రకంగా సాంప్రదాయక సాహిత్యానికి రాయలసీమ చిట్టచివరి కేంద్రం. ప్రాణవాయువు లేని ఇలాంటి వాతావరణం నుంచి బయటకు వచ్చి భాషలో, భావంలో, రూపంలో, దృక్పథంలో కృత్రిమత్వాన్ని తిరస్కరించి సమకాలీన జీవితాన్ని సాహిత్యంలోకి తీసుకురావడానికి ఈ సీమ రచయితలు ఎంతో క్షోభను అనుభవించారని సాహితీ విమర్శకులు వల్లంపాటి వెంకట సుబ్బయ్య పేర్కొన్నారు.

రాయలసీమ జిల్లాల్లోనే అనంతపురం జిల్లా పరిస్థితే వేరు. ఈ జిల్లా భారతదేశం మొత్తం మీద అత్యల్ప వర్షపాతం గల జిల్లా కావడమే. ఇక్కడి సగటు వర్షపాతం 522 మి.మీ. మాత్రమే. ఈ అత్యల్ప వర్షమూ సకాలంలో కురవకపోవడమే ఇక్కడి రైతుల విషాదం. ఈ జిల్లాకు కరువులు కొత్తవి కావు. పంట నష్టమూ కొత్తది కాదు. తరతరాలుగా అనావృష్టిని అనుభవిస్తున్న జిల్లా ఇది. 125 సంవత్సరాల కాలంలో 63 కరువులను అనుభవించిన జిల్లా ఇది. గత పదేళ్ళలో ఆరు కరువులను అనుభవించిన జిల్లా ఇది. అప్పులు, వలసలు, ఆత్మహత్యలూ ఈ జిల్లా ప్రజలకు సర్వసాధారణం.

ఈ సంక్షోభ స్థితిలో నుంచి ఇక్కడి కవిత్వమూ కథలూ, నవలలూ ఈ సామాజిక జీవితాన్నే కేంద్రంగా తీసుకున్నాయి. ఈ నేపథ్యంలోంచి బలమైన కవితా గొంతులు ప్రతిధ్వనిస్తున్నాయనడానికి ప్రత్యేక తార్కాణం రాయదుర్గం కవి కెరె జగదీష్ రాసిన కవిత్వం - 'సముద్రమంత గాయం.'

సమాజంలో నిరంతరం ప్రజల మధ్య సంచరించే జర్నలిస్టు కవిగా, సామాజిక బాధ్యత తెలిసిన ఆధునిక కవిగా కె.రె. జగదీష్‌ను సాహితీ ప్రపంచానికి పరిచయం చేయవలసిన అవసరం నేటి విమర్శకులకు ఉంది.

అనంతపురం - కర్నాటక సరిహద్దు ప్రాంతమైన రాయదుర్గంలో ఎలాంటి సాహిత్య వాసనా లేని కుటుంబంలోంచి ఎలుగెత్తి తన ఉనికిని చాటుకున్న కవి. నిజం చెప్పాలంటే సరిహద్దు భాషా ప్రభావంతో జీవిస్తున్న వారంతా ప్రవాసాంధ్రులే. అపారమైన అనుభవం జీవిత సంఘర్షణ ఒడిదుడుకులు మనిషిని కవిత్వంగా మార్చేందుకు ఎంతో కాలం పట్టదు అన్న ప్రముఖ కవి కె. శివారెడ్డి మాటల్ని నమ్మితీరాలి. జగదీష్ జర్నలిస్టుగా విమర్శనాత్మక వాస్తవికతను కవిత్వంగా మలుచున్నాడు. అనేకానేక సారభూత అనుభవాల్నుంచీ కవిత్వాన్ని పండించాడు.

సమాజం పట్ల తాను పెంచుకున్న ప్రేమానురాగాలను కవితాక్షరాలుగా, సామాజిక సంక్షోభంలో పెల్లుబికిన వేదనలన్నీ అనుభవాలుగా మల్చుకొని కవిగా ఎదిగినట్లు ఎంతో వినయంగా చెప్పుకున్నాడు ఈ కవి. తనలోని అంతర్మథనమే - 'సముద్రమంత గాయం' అయింది. ఈయన మాతృభాష కన్నడమే అయినా తెలుగు భాషాభిమానం వీరిని అచ్చమైన తెలుగు కవిగా తీర్చిదిద్దింది. ఈ కవిత్వం వెనుక రెండు దశాబ్దాల కవిత్వాభిమానం, అధ్యయనం, ఏకాగ్రత, నిబద్ధతలు ఉన్నాయి.

జరిగిన విధ్వంసాన్ని తీవ్రంగా నిరసిస్తాడు.

అనంత జీవనంలో ఛిద్రమైన రైతన్నల స్వప్నాలను ఆవిష్కరిస్తాడు.

"నాగలి మోసిన భుజం మీద / తుపాకీ మొలవక ముందే/
నేలలో దాగిన విత్తనాలు / బాంబులై పేలకముందే /

రైతుల కన్నీటి అలలు / ఉప్పెనలా ముంచకముందే / మేల్కొండి /

పాలకులారా మేల్కొండి"

అంటూ పరిపాలనా యంత్రాంగానికి సంకేతాలు పంపుతాడు.

నూరేళ్ళు నిండిన ఆరేళ్ళ శరీరాలు మురికి గుంటల్లో, ముళ్ళకంపల్లో, మట్టి కుప్పల్లో, మార్చురీ గదుల్లో శవాలై చట్టాలను ప్రశ్నిస్తున్నాయంటూ నోయిడాలో దారుణ హత్యలకు గురైన పసిపిల్లల దృశ్యాలను మన కళ్ళ ముందుంచుతాడు.

రైతన్నలు ప్రాణాలు కోల్పోతున్న ఆకలి నేలలో ఆత్మాభిమానం ఆహుతి కాలేదని వివరిస్తాడు. అనంత ఒడిలో దుఃఖిస్తున్న మట్టిబిడ్డల కన్నీటి చుక్కలు నేలగుండెలపై సేదదీర్చుకొంటున్నాయని, తడారిన నేలపై ఎండిపోతున్న బతుకుల్ని పోరాటం వైపు మళ్ళమంటున్నాడు. 60 వసంతాల స్వాతంత్ర్య దినోత్సవాన్ని గుర్తుకు తెచ్చుకుంటాడు.

"నా దేశంలో / అరవై వసంతాల స్వాతంత్ర్యం / ఆత్మవంచనా రాజకీయాల సాక్షిగా / అంతులేని అవినీతి పయనం / హమారా భారత్ మహాన్ /"

ఈ కవిత్వ సంపుటి తన మాతృమూర్తికి పాదాభివందనంతో ప్రారంభమై 'నిశ్శబ్దం'తో ముగుస్తుంది.

"అమ్మ స్పర్శలో / ముంగారు వానల తొలకరి జల్లుల పరిమళం / బంగారు వన్నెల / కాంతి కిరణాల సంతకం / రెండు బొట్లు కన్నీటిని / కనురెప్పల చాటున దాచుకొని / నిశ్శబ్ద దుఃఖానికి / నవ్వులు అతికించడం / అమ్మతనానికి నిదర్శనం /" అంటూ తన కోసం శత వసంతాల ఆనందంతో ధరిత్రిలా పులకరించిన అమ్మకు పాదాభివందనం చేస్తాడు కవి.

గాయాల పూదోటలో అనాగరిక సాంప్రదాయం వెలిగించిన 'రెడ్ నైట్' నీడను ప్రస్తావిస్తాడు. చిట్లిన గాజు ముక్కలు చేసిన రక్తగాయాలను స్పృశిస్తాడు. నిరంతరం నిప్పుల స్నానం చేస్తున్న సొమ్మసిల్లి పోతున్న సీతాకోకచిలుకలను స్పృశిస్తాడు కవి –

"గాయాలను చూసి నిందించడం – గుండెలో గుచ్చుకొంటున్న గాయాలను / స్పర్శించి పరామర్శించు / దాహం తీర్చుకున్న నీవు / గర్జించడం కాదు / వర్షించడం నేర్చుకో../" మంటూ హెచ్చరిస్తాడు.

మరణిస్తున్న నమ్మకాన్ని బతికించమంటాడు. తన ప్రతీ శ్వాసా కవిత్వంగా మార్చుకుంటానని తన మస్తిష్కంలో కవితాక్షరాలు కనుమరుగైతే జీవన శ్వాస ఆగి మరణిస్తానని ఎంతో ఆర్ద్రంగా చెబుతారు. కవిత్వానికి ఈ ఆర్ద్రత చాలా అవసరం. కళ్ళు తెరవకముందే మాతృప్రేమకు దూరమైన పసికందులను పరామర్శిస్తాడు. శవాల గుట్టలపై ఉగ్రవాదుల విజయ కేతనాన్ని దగ్ధగీతంగా అభివర్ణిస్తాడు. హైదరాబాద్ – గోకుల్‌చాట్, లుంబినీ పార్కుల్లో 2004లో ముంచుకొచ్చిన 'సునామీ' చావు మరకల దాహంలో మృతి చెందిన అభాగ్యులకు స్మృత్యంజలి ఘటిస్తూ "జల సమాధిలో / అభాగ్యుల కన్నీటి ధారలు / నురగలు గక్కుతూ / వేదనా రాగాలను ఆలపించాయి / సునామీ చేసిన శవాల జాతరలో / కళేబరాల కంపువాసనలతో / ఆ కడలి తీరం / చావు మరకల దాహం తీర్చుకుంది" సముద్రమంత గాయాన్ని మన కళ్ళ ముందుంచుతాడు.

నా దేశంలో నాలుగు సింహాలు నాలుగు మతాలను స్వీకరించాయని, త్రివర్ణ పతాకం వర్ణభేదాలతో రంగులు మార్చుకుందని, మతం మత్తులో మనిషి కుత్తుకలు కోస్తుండే మనిషిగా పుట్టినందుకు సిగ్గుపడుతున్నానంటున్నాడు కవి.

అనంత జనజీవనం సాక్షిగా, చినుకు పడని మేఘాల సాక్షిగా అనంత జిల్లా దయనీయ జీవితాన్ని వర్ణిస్తూ –

"ఇప్పుడు నా సీమలో / అన్నదాత ప్రశ్నార్థకమవుతున్నాడు/ కరువు రగిలించిన చితిమంటను / ఉన్మాదంతో కౌగిలించు కుంటున్నాడు / నాగేటి చాళ్ళలో విత్తనంగా మారి / మొక్కగా ఎదగలేక / మట్టిలో కలిసి పోతున్నాడు" – ఇక్కడి వ్యవసాయదారుల ముఖచిత్రాల్ని గీస్తున్నాడు. ఒక్కొక్క జ్ఞాపకం శిథిల శూలమై జీవితాన్ని గాయపరుస్తోంటే ఈ కవి మౌనంగా ఉండలేనంటున్నాడు.

"ఇక్కడ మబ్బు తునకలు / మబ్బులోనే అదృశ్య మవుతుంటాయి / రైతుల కళ్ళలో దుమ్ముకొట్టి / జారిపోతున్న సైకత స్వప్నాలు / దేహాన్ని దాచాల్సిన బట్టలు తగలబడిపోతున్నాయి / అన్నం ఉడకాల్సిన కుండలు పేలిపోతున్నాయి/" అంటూ ఉదయ ఘంటలను మ్రోగించడం నేర్చుకోమంటున్నాడు.

గత రెండు దశాబ్దాల్లో జాతీయంగా అంతర్జాతీయంగా సామాజిక రాజకీయ అల్లకల్లోలాల్ని సంక్షోభాల్ని సంఘటనాత్మక కవితలుగా రాశాడు కవి.

సంపుటిలో పది సంఘటనాత్మక కవితలు.

యశోదా హాస్పిటల్ హైదరాబాద్ గురించిన అయిదు కవితలున్నాయి. ఆసుపత్రి గదిలో సైతం ఆలోచనలు రెక్కలు విప్పి విహరించిన సన్నివేశాన్ని గుర్తుచేశాడు కవి.

తన శ్వాసను కవిత్వంగా మార్చుకున్న కెరె జగదీష్ కవిత్వంలోనే జీవిస్తున్నాడు. కవిత్వమై చరిస్తున్నాడు. ఎందుకంటే – కవిత్వాన్నే నమ్ముకున్న సంకల్ప జీవి. అనంత అక్షర పొదిలోని మరో కవితాస్త్రం – సముద్రమంత గాయం!

ఆకాశమంత ఆకలి సీమలో "సముద్రమంత గాయం" కెరె జగదీష్ కవిత్వం.

# కొత్త పుస్తకాలు




## కవిగానే కనుమూస్తా (కవిత్వం)

- కె. జనార్దన మహర్షి

వెల : రూ.90/- పేజీలు : 175

ప్రతులకు : 9848787284

జనార్దన మహర్షి కవిత్వంలో తాత్వికత దర్శనమిస్తుంది. లోతైన ఆలోచన - ఒక లోచూపు ఉంటుంది. దానిని ఎవరి మేధను బట్టి వారు అర్థం చేసుకోవాలి. అలా అయితే ఇంత విమర్శ సాహిత్యం వచ్చేది కాదు. మనం "సద్వినియోగం" చేసుకోవడంలోనే తెలివితేటలుంటాయి.

- డా॥ ద్వానా శాస్త్రి




## లైఫ్ & చార్‌మినార్ (డాక్యు - పోయెం)

- అయినంపూడి శ్రీలక్ష్మి

వెల : రూ.75/- పేజీలు : 48

ప్రతులకు : 9989928562

అటు కవిత్వంలోనూ, ఇటు డాక్యుమెంటరీలలోనూ ఓ కొత్త పంథాకు దారులు తీసిన నవ్యప్రయోగం ఇది. సాధారణంగా పోయెట్రీ అక్షర సంకలితం! డాక్యుమెంటరీ దృశ్య ప్రామాణికం! ఈ రెండింటికీ మధ్య ఉండే విభజన రేఖను, సరిహద్దు గీతలను చెరిపేసి, రెండింటి సమన్వయంతో - సమ్మేళనంతో సంపూర్ణ రససిద్ధిని కల్గించిన వినూత్న... విశిష్ట... వైవిధ్య ప్రయోగం - "లైఫ్ @ చార్మినార్!"

- మామిడి హరికృష్ణ




## బీల (రెండు కథలు, కొన్ని వ్యాసాలు)

- అట్టాడ అప్పల్నాయుడు

వెల : రూ.30/- పేజీలు : 59

ప్రతులకు : 98481 32208

వాళ్ళు భూమితో సాముజేసి, కాసిన్ని పంటలు పండిస్తారు. ఆ పంటల వలన ... కాసిన్ని కడుపులు నిండుతాయి. వాళ్ళు, పలురకాల మొక్కలు నాటి తోటలు పెంచుతారు. ఆ తోటల్లో కాసిన పండ్లతో, కాసిన్ని నోళ్ళు - పండ్లు దినీ, గింజలు ఊస్తాయి, పూసిన పూలతో, కాసిన్ని దేవతల విగ్రహాలూ అభిషేకం పొందుతాయి. వాళ్ళు మట్టిని మంత్రించి.. కాసిన్ని... మాణిక్యాలను వెలికితీస్తారు. వాటితో, వాళ్ళను పాలించే పాలకులకు సిరిసంపదలు సమకూరుతాయి.

- అట్టాడ అప్పల్నాయుడు




## భారతీయ నవల

- వాడ్రేవు వీరలక్ష్మీదేవి

వెల : రూ.120/- పేజీలు : 210

ప్రతులకు : 98481 32208

గ్రామాల్లో ఉన్న యువతకీ, ఇళ్ళల్లో ఉండే గృహిణులకీ మాత్రమే కాక, ఈ పుస్తకం సాహిత్యవేత్తలకీ, రచయితలకీ కూడా చాలా ఉపకరిస్తుందనుకుంటాను. 19వ శతాబ్ది భారతదేశంలో బెంగాలీ తరువాత నవల తలెత్తింది తెలుగు భాషలోనే. బంకిం బాబు 'దుర్గేశ నందిని' (1865) రాసి పదేళ్ళు కూడా తిరగకుండానే నరహరి శెట్టి గోపాలకృష్ణను శెట్టి 'సోనాబాయి చరిత్రము' (1872) రాశాడు. పూర్తిగా వికసించిన మొదటి తెలుగు నవల వీరేశలింగం 'రాజశేఖర చరిత్రము' (1878) అనుకుంటే అప్పటికింకా తమిళం, కన్నడం, మలయాళం, మరాఠీ, హిందీ, గుజరాతీ, ఒరియా భాషల్లో నవల తలెత్తనే లేదు.

- వాడ్రేవు చినవీరభద్రుడు




## భారతీయ తాత్త్విక సమాలోచనము

- వేదాంతం లక్ష్మీప్రసాదరావు

వెల : రూ.75/- పేజీలు : 134

ప్రతులకు : 040-23343782

భాష్యాలతో, కారికలతో విస్తృత పరిధిని సంతరించుకున్న భారతీయ తాత్త్విక సమాలోచనను చాలా క్లుప్తంగా, సరళమైన భాషతో అందివ్వడానికి ప్రయత్నమే ఈ చిన్న పుస్తకం. భారతీయ తత్త్వశాస్త్రం గురించి ఈనాడు ఎవరైనా కొత్తగా చెప్పేది ఏమీ లేదు . పలు గ్రంథాలు పఠించిన అవగాహన మేరకు ఈ పుస్తకం సంకలనం చేయడం జరిగింది.

- వేదాంతం లక్ష్మీప్రసాదరావు




## ఛానెల్ 18 (నవల)

- ఎ.ఎన్. జగన్నాథశర్మ

వెల : రూ.120/- పేజీలు : 208

ప్రతులకు : 98484 32208

ఆశలు అందరికీ వుంటాయి. అవకాశాలు మాత్రం కొందరికే ఉంటాయి. ఆ సంగతి తెలియని పదహారేళ్ళ పడుచుపిల్ల టీవీలో నటించేందుకు అన్న ప్రేమను కాదనుకుంది. ఉన్న ఊరును కాదనుకుంది. పరుగుదీసింది. కొండలెక్కింది. లోయల్లోకి దూకింది. జలపాతాల్లో కొట్టుకుపోయింది. ఎడారిలో... ఇసుక తుఫానుల్లో చిక్కుకుంది. కష్టాలన్నీ గట్టెక్కి ఎలాగయితేనేం టీవీ నటి అయింది. శరపంజరంలో చిక్కుకుంది. పంజరంలో బందీలయిన చిలుకయినా మనిషయినా చెప్పిందే చేయాలి. పెట్టిందే తినాలి. స్వేచ్ఛ ఉండదు. ఆ సంగతి తెలుసుకునేసరికి అంతా అయిపోయింది.

- ఎ.ఎన్. జగన్నాథశర్మ




## విద్య - విలువలు

వెల : రూ.60/- పేజీలు : 96

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

విద్యా విజ్ఞానాలు వ్యాప్తి చెందకుండా ఏ జాతి పురోగమనాన్ని ఊహించలేము. విద్యా బోధనలోనూ, విద్యాలయాల నిర్వహణలోనూ నిరంతరం మార్పులు వస్తూనే వుంటాయి. అలాగే సామాజికంగా ఉపాధ్యాయులు విద్యార్థులకు మధ్యనా కుటుంబాలలో తల్లిదండ్రులకూ, పెద్దలకూ, పిల్లలకూ మధ్యనా ఎలాంటి సంబంధాలు వుండాలనేది కూడా నిరంతరం చర్చనీయాంశంగా వుంటుంది. ఇవన్నీ మౌలిక విలువలకు సంబంధించిన ప్రశ్నలను ముందుకు తెస్తాయి. భారతదేశ చరిత్రలో కీలక పాత్ర వహించిన మహానేతలు, దార్శనికులు ఈ విషయమై వెలిబుచ్చిన అభిప్రాయాల సమాహారమే ఈ పుస్తకం.

**- ప్రచురణకర్తలు**




## కథా సరిత్సాగరం

**- అయల సోమయాజుల నీలకంఠేశ్వర జగన్నాథశర్మ**

వెల : రూ.130/- పేజీలు : 164

**ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు**

ఇందులో ప్రేమకథలు ఉన్నాయి. వీరుల కథలు ఉన్నాయి. హాస్య - చమత్కారాలు ఉన్నాయి. అద్భుత కృత్యాలు, భయానక దృశ్యాలు, సాహస కార్యాలు, సముద్ర ప్రయాణాలు, గగన విహారాలు, యంత్రమయ పట్టణాలు. మహా పాపాలు... ఎన్నెన్నో వున్నాయి. జంతువులు మాట్లాడుకునే పంచతంత్ర కథలు, విక్రమార్కునికి బేతాళుడు చెప్పినటువంటి కథలు కూడా ఇందులో ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రపంచ కథా సాహిత్యం అంతా ఇందులో నిక్షిప్తమై ఉంది.

**- ప్రచురణ కర్తలు**




## బతుకు బండి (కథల సంపుటి-2)

**- అరిగే రామారావు**

వెల : రూ.75/- పేజీలు : 203

**ప్రతులకు : 040-24744580**

**(విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

సంఘటనలూ, సన్నివేశాలూ, స్వీయానుభవాలు, అనుభూతులూ వీటితో పాటు ఇతరుల అనుభవాలను కూడా కథలుగా మలచగల నేర్పు, స్త్రీల బుల్లి బుల్లి కోరికలూ, వేదనలూ, సగటు మనుషుల కష్టసుఖాలూ, దాంపత్య బంధాలూ, శృంగారం ఆయన కథలకి ప్రాణభూతాలు. సెంటిమెంట్లను పండించడంలో సిద్ధహస్తులు. కథనం సింపుల్‌గా సహజంగా వుంటుంది.

**- కప్పగంతుల మల్లికార్జునరావు**




## తెలంగాణ జాతీయాలు

**- వేముల పెరుమాళ్ళు**

వెల : రూ.200/- పేజీలు : 370

**ప్రతులకు : (అన్ని ప్రముఖ పుస్తక షాపులలో)**

వేముల పెరుమాళ్ళు గారిలో గొప్ప వర్ణనా కౌశలం ఉంది. ఆయనలో మంచి భావుకత ఉన్నది. ఆయన మాటల్లోనే "చింతకాయలు పట్ట పట్ట రాలుతుంటాయి. చిగురంత నీడపట్టున మాత్రమే జువ్వ జువ్వ పెరుగుతుంది. దున్నలు జొచ్చిన మడుగు లొబ్బి లొబ్బి అవుతుంది" లాంటి వాక్యాలు చదివినంక అతనిది ఎంత సహజమైన "రాత తీరు" అన్నది అర్థమవుతుంది.

**- డా॥ నలిమెల భాస్కర్**




## కవితా దర్పణం

**- నమిలికొండ జగన్మాధవరావు**

వెల : రూ.40/- పేజీలు : 62

**ప్రతులకు : 08723 254306**

లోకంలోని మాయామర్మాల గుట్టు విప్పి మానవతా విలువలను రక్షిస్తాడు. వజ్ర సంకల్పంతో మరో ప్రపంచ రూపకల్పనకు పూనుకుంటాడు. చీకట్లో చిరుదీపాలు వెలిగిస్తాడు. పండుగల పర్వాల్లోనూ హృదయం అర్థమైతే కవితాశ్రయాన్నే నమ్ముతాడు. తన కవితల ద్వారా పరిష్కారాలను వెలికితీస్తాడు. తనొక కవితా సైన్యపు బంటు అవుతాడు. కవితనే జీవిత చిత్రంలా మలచుకున్న 'జమారా'ను అతి దగ్గరగా అధ్యయనం చేస్తే 'శ్రమ'ను ఇష్టంగా స్వీకరించే మధుర నైజం కానవస్తుంది.

**- నమిలికొండ హరిప్రసాద్**




## అస్త్రం (చిన్న కథలు)

**- డా॥ కె.ఎల్వీ. ప్రసాద్**

వెల : రూ.50/- పేజీలు : 71

**ప్రతులకు : 0870-2432098**

డా॥ కె.ఎల్.వి. ప్రసాద్‌గారు వృత్తిరీత్యా డాక్టరే కావచ్చు. ప్రవృత్తిరీత్యామాత్రం సాహిత్యోపజీవి. సాహిత్యం అంటే ఏదో ఒక ప్రక్రియకు పరిమితమైన వ్యక్తి కాదు. అన్ని సాహిత్య ప్రక్రియల్ని అమితంగా ప్రేమించి, అన్నింటిలోనూ అంతో ఇంతో శ్రమ చేసి తమ అభిరుచికి మెరుగులు పెట్టుకున్నారు. తమ వైద్య విభాగానికి సంబంధించిన అనేక అంశాల్ని వ్యాసాల రూపంలో తెలుగు నేలలోని వివిధ పత్రికలలో వెలువరించడమే గాక, ప్రత్యేక గ్రంథాలుగా కూడా వెలువరించారు.

**- జి. గిరిజా మనోహరబాబు**

# గోదావరి ఒడిలో కవయిత్రుల సమ్మేళనం

- అయినంపూడి శ్రీలక్ష్మి

కవిత్వం ఎదలో మెదులుతుంది. పదంలో కదులుతుంది. అభ్యుదయాన్ని అందిస్తుంది. అందుకే 'కవులను అనధికార శాసనకర్తలు' అంటారు. భవిష్యత్తును ఊహించి సమాజాన్ని నడిపించే కవులెప్పుడు దార్శనికులే... అందునా "ఆకాశంలో సగం మాత్రమే కాదు.. స్వయం ప్రకాశకులు కూడా"నంటూ ముందడుగేస్తున్న వీరు కవయిత్రులుగా అవతరిస్తే... అబ్బో... ఆ సంబరం అంబరాన్ని అంటాల్సిందే. అదే జరిగింది ఆదిలాబాద్ జిల్లాలోని బాసరలో ఆర్య వైశ్య అన్నదాన సత్రంలోని ఆడిటోరియంలో..



బాసరలో 'ఈవెంట్ 9' నిర్వహణలో జరిగిన మహిళా కవి సమ్మేళనంలో పాల్గొన్న ఆదిలాబాద్ ఆల్ ఇండియా రేడియో ప్రోగ్రామ్ హెడ్ రాంబాబు, కవయిత్రులు (ఎడమ నుండి కుడి వైపుకు) పొత్తూరి విజయలక్ష్మి, జి. విజయలక్ష్మి, అయినంపూడి శ్రీలక్ష్మి, రేణుక అయోల, వాసా ప్రభావతి, తమిరిశ జానకి, ఆచార్య శరత్ జ్యోత్స్నారాణి, వారణాసి నాగలక్ష్మి, శ్రీవల్లి రాధిక, శైలజామిత్ర, కొండపల్లి నీహారిణి, ఎం. చంద్రకళ, నళిని

నవంబర్ 20న కవయిత్రులు గలగలమంటూ పారే గోదారి తల్లి ఒడిలో కమనీయ కవి సమ్మేళనాన్ని జరుపుకున్నారు. 'ఈవెంట్ 9' ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమంలో ఆద్యంతం కవయిత్రుల రమణీయ కవితలు ఆహుతుల్ని అలరించాయి. సబ్బు బిళ్ళ నుండి సమకాలీన సాహిత్యం దాకా... జడ నుండి జీవకారుణ్యం వరకు వారు స్పృశించని అంశమే లేకుండా పోయింది. అవినీతిని అంతమొందించాలంటూ అన్నా హజారే ఇచ్చిన పిలుపు ఈ ప్రాంగణంలో కవిత్వంగా పారింది.. ప్రతి ఎదలో ప్రతిధ్వనించింది...

మద్రాసు వారి గృహలక్ష్మి స్వర్ణ కంకణంతో పాటు, సుభద్రా కౌముది చౌహాన్ అవార్డును కూడా అందుకున్న డాక్టర్ వాసా ప్రభావతి ఈ సభకు అధ్యక్షత వహించారు. ఆచార్య శరత్ జ్యోత్స్నారాణి ప్రత్యేక ఆహ్వానితురాలుగా విచ్చేశారు. 40 ఎం.ఫిల్‌లు, 16 పిహెచ్‌డి అందుకున్న తన స్టూడెంట్స్‌లో సృజనాత్మకత వల్ల పెరిగిన జీవన విలువల్ని తన అనుభవాలుగా అందించారు. తమరిశ జానకి, పొత్తూరి విజయలక్ష్మి, శైలజామిత్ర, వారణాసి నాగలక్ష్మి, రేణుకా అయోలా, శ్రీవల్లీ రాధిక, అయినంపూడి శ్రీలక్ష్మి, జి. విజయలక్ష్మి, కొండపల్లి నీహారిణి, ఎం. చంద్రకళ, దేవికారాజ్, మల్లవరపు విజయ, గంథం విజయలక్ష్మి ఇలా 16 మంది పాల్గొన్న ఈ వేదికలో ఆధునిక కవిత్వపు పోకడలు.... సమాజంపై కవిత్వం ప్రభావాలు చర్చకు వచ్చాయి..

అధ్యక్షుల వారి తొలి పలుకుల్లో డాక్టర్ వాసా ప్రభావతి వేదకాలం నుండి ఆధునిక కాలం వరకు మహిళల్లో... వారి కలం పోకడలలో వస్తున్న వాడిని వేడిని సోదాహరణంగా వివరించారు. డాక్టర్ శరత్ జ్యోత్స్న రాణి నినాదాలే కవిత్వమన్న కాలాల నుండి... దళిత, స్త్రీ, విప్లవ వాదాలు.. అరసం, విరసం, బహుజన వాదాల నుండి ప్రస్తుత కాలం వరకు కవిత్వంలోని మలుపుల్ని వివరణాత్మకంగా తెలియజేశారు.

"హైదరాబాద్ బతుకు ఆల్బమ్‌లో - ఒక బ్లాక్ అండ్ వైట్ ఫోటో రెండుగా చీలిపోతున్న నగరం... ఎలా కలపాలి... కలిసే వుంటూ కలవని నీరెండ" అంటూ రేణుకా అయోలా నగరం చుట్టూతా పారుతున్న దిగులును ఆవిష్కరించి చూపితే.. ఊరు ప్రయాణం గురించి వివరిస్తూ - మనిషి కన్నా ముందు జ్ఞాపకాల పట్టాలపై పరుగులు తీస్తాయి. నేను పాత మనిషిగానే ఊరిని పలుకరిస్తాయి. ఊరే కొత్త ముస్తాబుతో నన్ను మాత్రం పాతగా చూస్తుంది... అంటుంది... కవయిత్రి వారణాసి నాగలక్ష్మి "పొంచి వున్న ఎడారిగా" పంట పొలాలన్ని సెజ్‌లుగా మారాక సేద్యం లేదు.. స్వేదం లేదు, రేపటి తరం గురించి ఆలోచించే సమయం లేదంటుంది" అని వ్యంగ్య బాణాలతో వాస్తవాన్ని అక్షరాలుగా ఎత్తిచూపింది. శైలజామిత్ర రణం, మారణహోమం సమాజ గతిని చూసి వేదనతో రాసిన 'మానుషీయం' కవితలో 'ఎన్ని జెండాలు ఎగరేసినా రంగులు మూడే.. ఎన్ని ఎజెండాలు తిరగరాసినా 'మనిషి' మూడే.. అంటుంది.. 'అ'వినీతి కూడా మూడక్షరాలైతే బాగుంటుందని ఆకాంక్షిస్తుంది.. ఇంద్రధనుస్సు రెక్కగా 'శ్వేతాంకురాన్ని భావిస్తూ ఆ తెల్ల వెంట్రుక చిత్రాన్ని హృద్యంగా సభకు

# రచయిత అవసరాల కన్నుమూత



ప్రముఖ రచయిత అవసరాల రామకృష్ణారావు (80) అక్టోబర్ 28న తుదిశ్వాస విడిచారు. 1931 డిసెంబర్ 21న మద్రాస్‌లో తిరుపతమ్మ, జగన్నాథరావు దంపతులకు రామకృష్ణారావు జన్మించారు. స్వస్థలం తూర్పుగోదావరి జిల్లా తుని. ఇక్కడ రాజావారి ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడిగా కూడా పనిచేశారు. ఆంగ్లభాషలో పిహెచ్‌డీ చేశారు. ఒరిస్సాలో మూడు దశాబ్దాల పాటు ప్రభుత్వ కళాశాలలో అధ్యాపక వృత్తిలో కొనసాగిన ఆయన బలంగిరి ప్రభుత్వ కళాశాలలో ప్రిన్సిపల్‌గా పదవీ విరమణ చేశారు. అనంతరం 20 ఏళ్లపాటు విశాఖపట్నంలో నివాసం ఉన్నారు. గత ఐదేళ్లుగా భార్య శారదతో హైదరాబాద్‌లోని కల్యాణ్‌నగర్‌లో కుమారుడు జగన్నాథరావు వద్ద ఉన్నారు.

రామకృష్ణారావు దాదాపు ఆరు దశాబ్దాల పాటు తెలుగునాట సాహితీ పంటలు పండించారు. హాస్య రచయితగా పేరొందిన ఆయన రచనల్లో వ్యంగ్యం వెనుక జీవన వాస్తవాల గాంభీర్యత కూడా కనిపిస్తుందని సాహితీ విశ్లేషకులు చెబుతుంటారు. చందమామ మాస పత్రికలో తన 15వ ఏటనే (1947లో) 'పొట్టి పిచిక' కథ రాసిన రామకృష్ణారావు. దాదాపు 600 కథలను రాశారు. 15 నవలలు, పిల్లల కోసం 'గణిత విశారద', 'కేటు డూప్లికేటు' వంటి ఆరు పుస్తకాలు రాశారు. వల్లథోల్, నారాయణ్ మీనన్ వంటి ప్రముఖుల మోనోగ్రాఫ్ (ఏక విషయక రచన) లను తెలుగులోకి అనువదించారు. సంపంగులు, సన్నజాజులు, సహజీవన సౌభాగ్యం లాంటి నవలలు ప్రాచుర్యం పొందాయి. అవసరాల రామకృష్ణారావు సాహితీ సృజనకు గుర్తింపుగా 1969లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం దక్కింది. 1994లో తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం, 1998లో జ్యేష్ఠ లిటరరీ అవార్డు, 1999లో కొలసాని చక్రపాణి అవార్డు, 2000లో ఢిల్లీ తెలుగు అకాడమీ ఉగాది పురస్కారం, అదే సంవత్సరంలో చండీగఢ్ ఆంధ్ర సమితి పురస్కారం 2004లో ఆంధ్రప్రదేశ్ తెలుగు వైభవం పురస్కారం, కూరెళ్ల సాహితీ పురస్కారం, 2006లో మద్రాసు ఉగాది పురస్కారం లభించాయి. విశాఖ నగరంలో దేహ దాన ఉద్యమానికి ఊపిరులూదిన మానవతావాదిగా అవసరాల, గుర్తింపు సాధించారు. తాను నమ్మిన హేతువాద విలువలను తుదికంటా పాటించారు. విశాఖలో 2005లో 'మృతదేహ దాన సమితి' ఏర్పాటు చేశారు. కొంతకాలం తరువాత ఆ సంస్థను సావిత్రీ బాయ్‌పూలే ఎడ్యుకేషనల్ అండ్ ఛారిటబుల్ ట్రస్ట్‌లో విలీనం చేశారు. జీవితాంతం ఆ సంస్థ మేనేజింగ్ ట్రస్టీగా కొనసాగారు.

---

అందించారు అయినంపూడి శ్రీలక్ష్మి.. కాలాధిపతి తెల్ల సిరాతో చేసిన అధికారిక సంతకంగా కన్పించిందంటారు.. చేసుకున్నంత చేవ ఈ తెల్లవెంట్రుకదేనంటూ కొంగొత్త కోణాన్ని ఆవిష్కరింపచేశారు. ఎన్నేళ్ళు గడిచినా తరగని జ్ఞాపకాల గని బాల్యమంటూ డాక్టర్ వాసా ప్రభావతి బాల్యం గురించిన విశేషాల్ని ప్రతీకాత్మకంగా వెల్లడించారు. జి. విజయలక్ష్మి "నల్లపూసలు" అన్న కవితలో "కామిస్తే కన్యకా పరమేశ్వరులు, ప్రేమిస్తే కాశీ అన్నపూర్ణలు, ఎదురు తిరిగితే కలకత్తా కాళి నాలుకలం" అంటూ సవాల్ విసిరారు. పొత్తూరి విజయలక్ష్మి 'నవ్విస్తా'నంటూ ధరహాసాల్ని ధరపెట్టి కొనుక్కుంటున్న రోజుల్ని ఉదహరించారు. ఎం. చంద్రకళ పసందైన పద్యతోరణాలు కట్టింది. శ్రీవల్లీ రాధిక "ఆడిద్దామనుకుని ఆటబొమ్మనయ్యాను... ఎన్నాళ్ళగానో దాచుకున్న ఆస్తులన్నీ దోచుకున్నాడంటూ" స్త్రీ దౌర్భాగ్యాన్ని ఎండగట్టింది... "ఎగరనీ శాంతి కపోతాల్ని" అంటూ తమిరశ జానకి.. కులమతాలు... మారణహోమాలు లేని రోజు కావాలని ఆకాంక్షించింది.. కొండపల్లి నీహారిణి తన 'సాఫల్య జీవనం' కవితలో "జీవితం ప్రవాహం కాదు నిండుకుండ అంటూనే వయసును అక్కడే నిలిపి వేయ మంటున్నాను... అన్న అద్వైతాన్ని అందించారు... గంధం విజయలక్ష్మి నేను నేటి సీతను అంటూ అగ్ని ప్రవేశాన్ని, అశ్రుతర్పణాలను వెలివేద్దామన్నారు. మల్లవరపు విజయ కాలం నవ్వుకుందంటూనే.. స్త్రీలకి హృదయం ఉండకూడదంటుంది.

ప్రతి అంశాన్ని తమదైన దృక్పథంతో, దృక్కోణంతో ఆవిష్కరించారు, అలరించారు కవయిత్రులు. బాసర రావటం అందునా కవి సమ్మేళనం, కార్తీక దీపాలు.. ఆ గోదారిలో వదలటం... మరిచిపోలేని అనుభవంగా అభివర్ణించారు. ఈ 16 మంది కవయిత్రుల కవితలపై "నంది అవార్డు గ్రహీత" మామిడి హరికృష్ణ సమగ్రమైన విశ్లేషణని అందించి 'ఔరా' అన్పించారు. భవిష్యత్ తరాలను జాగృతం చేయడానికి కవయిత్రుల్లో ఇలాంటి చైతన్యం కావాలన్నారు... మహిళాభ్యుదయమే ప్రగతిపథ సూచికగా కొనియాడారు. ఇలా మరిన్ని కవయిత్రుల సమ్మేళనాలు జరగాలని.. ఈ కార్యక్రమానికి ఆతిథ్యం ఇచ్చిన మూడ నాగభూషణం గుప్తాలాంటి వారు మరింత మంది ముందుకు రావాలని కోరారు. ప్రతి నెల ఓ కార్యక్రమాన్ని ఏర్పాటు చేయాలనుకుంటున్నట్లు ప్రకటించారు. •

# హిందీ నవ రచయితల శిక్షణా శిబిరం



అక్షర సాహితీ సాంస్కృతిక సేవా పీఠం, రాజమండ్రి మరియు కేంద్రీయ హిందీ నిర్దేశాలయం, న్యూఢిల్లీ సంయుక్త ఆధ్వర్యంలో సెప్టెంబర్ 27 నుండి అక్టోబర్ 4వ తేదీ వరకు స్థానిక శ్రీ వెంకటేశ్వరా ఆనం కళాకేంద్రంలో హిందీయేతర భాష హిందీ నవ రచయితల శిక్షణా శిబిరం నిర్వహించబడినది. ఈ కార్యశాలలో న్యూఢిల్లీ నుండి విచ్చేసిన డాక్టర్ మల్లిక్ రాజకుమార్గారు నవ రచయితలకు మార్గదర్శకత్వం వహించారు.

సెప్టెంబర్ 27న కార్యశాల అతిథులు జ్యోతి ప్రజ్వలనంతో ప్రారంభమైంది. ఆదిత్య డిగ్రీ కళాశాల విద్యార్థినులు ప్రార్థనాగీతం ఆలపించారు. వ్యవస్థాపక కార్యదర్శి మరియు స్థానిక శిబిరం డైరెక్టర్ డాక్టర్ పేరిశెట్టి శ్రీనివాసరావు స్వాగతం పలికారు.




కార్యశాలను కేంద్రీయ హిందీ నిర్దేశాలయం సహాయక పరిశోధనా అధికారి మరియు శిబిరం ఇన్ఛార్జి డాక్టర్ మొహమ్మద్ నసీం ప్రారంభిస్తూ శిబిరం ఉద్దేశాన్ని మరియు లక్ష్యాలను వివరించారు. హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం హిందీ ప్రొఫెసర్ డాక్టర్ ఆర్.ఎస్. సర్రాజు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఫణి నాగేశ్వరరావు అధ్యక్షత వహించారు. విశిష్ట అతిథులుగా సి. సత్యనారాయణ (జి.ఎం. గెయిల్, రాజమండ్రి) మరియు డాక్టర్ కర్రి రామారెడ్డి పాల్గొన్నారు.

ఎనిమిది రోజుల ఈ కార్యశాలలో డాక్టర్ కామేశ్వరరావు, డాక్టర్ శేషగిరిరావు, డాక్టర్ రవిచంద్ర, శ్రీమతి జయలక్ష్మి విభిన్న సాహిత్య పద్ధతులపై నవ రచయితలకు అవగాహన కల్పించారు. అక్టోబర్ 2న గాంధీ జయంతి రోజున బహుభాషా కవి సమ్మేళనం కూడా నిర్వహించడం జరిగింది. అలాగే విభిన్న రాష్ట్రాల నుండి కార్యశాలలో పాల్గొన్న నవ రచయితలకు యాత్రా సాహిత్యంపై అవగాహన కొరకై స్థానిక చారిత్రక ప్రదేశాలకు భ్రమణం చేయించడం కూడా జరిగింది.

అక్టోబర్ 4న ముగింపు ఉత్సవానికి ముఖ్య అతిథిగా మానూ హిందీ ప్రొఫెసర్ డాక్టర్ టి.వి. కట్టిమని పాల్గొన్నారు. ఈ కార్యక్రమానికి ప్రొఫెసర్ వి. కృష్ణ అధ్యక్షత వహించగా ప్రొఫెసర్ ఎండ్లూరి సుధాకర్ మరియు గుమ్మడి సమర్పణరావులు విశిష్ట అతిథులుగా పాల్గొన్నారు. ఆఖరున కార్యశాలను విజయవంతంగా పూర్తి చేసుకున్న నవ రచయితలకు డాక్టర్ నసీం, కోసూరి సూర్యనారాయణ మరియు డాక్టర్ పేరిశెట్టి శ్రీనివాసరావు, అతిథులుచే ప్రమాణ పత్ర వితరణ జరిగినది. ఈ కార్యశాలకు ఎస్.పి. గంగిరెడ్డి కన్వీనర్గా, స్థానిక శిబిరం డైరెక్టర్గా డాక్టర్ పేరిశెట్టి శ్రీనివాసరావు వ్యవహరించారు. శ్రీమతి వెంకట సీతాదేవి ధన్యవాద సమర్పణతో కార్యశాల ముగిసినది.

**- డా॥ పేరిశెట్టి శ్రీనివాసరావు**

## చందాదారులకు ఓ విన్నపం

* ప్రస్థానం చందాదారుని చిరునామా పైన చందా యొక్క కాలపరిమితి సూచిస్తూ నెల - సంవత్సరం ఇస్తున్నాం. అది గమనించి వెంటనే మీ చందాను పునరుద్ధరించుకోగలరు (రెన్యువల్స్).
* కంప్యూటర్లోని రికార్డులో చందా ముగియడంతోనే ఆ చందాదారుని పేరు ఆటోమేటిక్గా డిలీట్ అవుతుంది. చందా కాలం ముగిసిందని ముందుగానే వారి చిరునామాకు కార్డు రాస్తున్నాం.
* ఆన్లైన్లో చందాను రెన్యువల్ చేసుకోవచ్చు. ఖాతా పేరు: ప్రస్థానం, ఖాతా నెం. 52001500585. బ్యాంక్: ఎస్బిహెచ్. ఆన్లైన్లో 5, 10 సంవత్సరాల చందాలు మాత్రమే అంగీకరించబడతాయి.
* సాహితీస్రవంతి కార్యకర్తలు, అభిమానులు చందాలను ఆన్లైన్లో జమచేసేటప్పుడు కనీసం 5 చందాలను ఒకసారి జమచేయగలరు. ఒకసారి ఆన్లైన్లో జమచేసినందుకు రూ. 25/-లు కట్ అవుతుంది.
* 5 సం॥ చందా డిస్కౌంట్లో రూ. 500/- కట్టడం వల్ల మీకు అన్ని సంచికలు క్రమంగా అందుతాయి. గ్యాప్లు రావు. రూ. 100/- ఆదా కూడా అవుతుంది. (5 × 120 = 600).
* ఎం.ఓ. పంపేవారు కూపన్కు ఒకవైపున మీ పూర్తి చిరునామా, ఫోన్ నెం. రాయండి. అడ్రస్ మారితే వెంటనే కార్డు రాయండి. ఇ-మెయిల్ కూడా పంపవచ్చు. ssprasthanam@gmail.com

# మహా దార్శనికుడు గురజాడ

## దేశభక్తిని పెంపొందించిన ప్రజాకవి

## 150వ జయంతి ఉత్సవాలలో వక్తలు

ఆధునిక సమాజానికి కొత్త బాటలు వేసిన మహా దార్శనికుడు గురజాడ అప్పారావు అని వక్తలు కొనియాడారు. దేశభక్తిని పెంపొందించిన ప్రజాకవి గురజాడ అని పేర్కొన్నారు. 'దేశమును ప్రేమించుమన్నా... మంచి అన్నది పెంచుమన్నా... దేశమంటే మట్టికాదోయ్... దేశమంటే మనుషులోయ్" అని తన కవిత్వంతో ప్రతి ఒక్కరిలోనూ స్ఫూర్తి నింపారని ఆయన రచనలను కొనియాడారు. 150 ఏళ్ళు అయినా ఇంకా ఇంత ఉత్తేజం పొందుతున్నామంటే గురజాడ ఎంత ముందుచూపు కలిగిన వారో అర్థమవుతుందన్నారు. గురజాడ అప్పారావు 150వ జయంతి ఉత్సవాలను సాహితీ స్రవంతి, ప్రజాశక్తి సాహితీ సంస్థ సంయుక్తంగా అక్టోబర్ 29న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నిర్వహించాయి. గురజాడ అప్పారావు చిత్రపటానికి హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం ప్రొఫెసర్ తుమ్మల రామకృష్ణ పూలమాలాలంకరణ చేశారు. అనంతరం ప్రజాశక్తి సంపాదకులు ఎస్. వినయ్‌కుమార్ అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా రామకృష్ణ మాట్లాడుతూ కన్యాశుల్కం నాటకం సామాజిక జీవన చిత్రంలో మిళితం చేసి తీశారన్నారు. కవిత్వం ప్రజల కోసమా? పండితుల కోసమా? అని ప్రశ్నించారని తెలిపారు. గురజాడ తన రచనలతో ప్రజల్లో ప్రజాస్వామిక భావాలను పాదుగొల్పారని చెప్పారు. ప్రజలు మాట్లాడుకునే భాషలో రచనలు చేయాలని, కవితలు రాయాలని గురజాడ భావించారన్నారు. కాలానికన్నా ముందుకు చూసిన వ్యక్తి గురజాడ అని కొనియాడారు. మూఢనమ్మకాలున్న రోజుల్లో హేలీ తోకచుక్క వస్తే అరిష్టమని అందరూ భావిస్తున్న సమయంలో భార్యను అర్ధరాత్రి బయటకు తెచ్చారని గుర్తు చేశారు. "మతములన్నీ మాసిపోవును... జ్ఞానమొక్కటే నిలిచిపోవును" అని సమాజానికి చాటి చెప్పారన్నారు. దేశభక్తి, బాల్య వివాహాల గురించి ప్రముఖ రచనలు చేశారని తెలిపారు. పుత్తడి బొమ్మ పూర్ణమ్మ, కన్యాశుల్కం వంటి ఒక్కో కథ ఓ సామాజిక వాస్తవికతతో కూడుకున్నదని చెప్పారు. సమాజాన్ని మార్చడం రచయిత బాధ్యత అని, అహంభావం పనికిరాదని అన్నారు. రచయితలకు అంకితభావమెలా ఉండాలో గురజాడను చూసి



సభలో ప్రసంగిస్తున్న ప్రొఫెసర్ తుమ్మల రామకృష్ణ, ఎస్. వినయ్‌కుమార్, తెలకపల్లి రవి తదితరులు

నేర్చుకోవాలని సూచించారు. 'నా అడుగుజాడ గురజాడ" అని మహాకవి శ్రీశ్రీ అన్నారంటే గురజాడ ఎంత గొప్పవారో తెలుస్తుందన్నారు. సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి మాట్లాడుతూ దైవభక్తి, రాజభక్తి ఉన్న చోట దేశభక్తిని ప్రవేశపెట్టారని చెప్పారు. స్త్రీ, పురుష సమానత్వాన్ని ప్రతిష్టించారని, దైవత్వాన్ని ప్రశ్నించారని తెలిపారు. సంస్కృత భాష చెల్లదని, ప్రజల భాష కావాలని తేట తెలుగు రాయాలని, పిల్లలు చదువుకోవాలని గురజాడ ఆ కాలంలో ధైర్యంగా చెప్పారన్నారు. భాషా సాహిత్యం ప్రజల భాషలో ఉండాలన్నారని గుర్తుచేశారు. సమాజం మార్పుకోరే కమ్యూనిస్టులు గురజాడ, వీరేశలింగంలను సమాజ వైతాళికులుగా గుర్తించారని చెప్పారు. గురజాడ 150వ జయంతి సమయంలో ప్రపంచీకరణలో భాగంగా మార్కెట్‌తత్వం, మతఛాందసత్వం పెరిగిపోయిందన్నారు. ప్రశ్నించడం, ప్రతిఘటించడం, ప్రజలను కదిలించడం, ప్రజా చైతన్యాన్ని పెంపొదించడం నేడు మన ముందున్న సవాళ్ళని చెప్పారు. గురజాడ సంకల్ప సిద్ధి, అంకితభావాలను ఆదర్శంగా తీసుకొని సవాళ్ళను ఎదుర్కోవాలని సూచించారు. ప్రజాశక్తి సంపాదకులు వినయ్‌కుమార్ మాట్లాడుతూ కవులు, రచయితలు చాలామంది ఉంటారని, మహాకవులుగా అందరినీ ప్రస్తావించలేమని చెప్పారు. సామాజిక పరిస్థితులు, చుట్టూ ఉన్న అంశాలే గురజాడను మహాకవిగా నిలిపాయని తెలిపారు. అభ్యుదయ రచనలు చేశారని, సమకాలీన సమాజంలోని మూఢవిశ్వాసాలను దూరం చేస్తూ రచనలు చేశారని గుర్తుచేశారు. బెంగాలీలకు రవీంద్రనాథ్ ఠాగూర్, తెలుగు ప్రజలకు గురజాడ గొప్పవారని చెప్పారు. సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ వందన సమర్పణ చేశారు.

# కవితల పోటీ విజేతలు

నెల్లూరు జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో 2011 సెప్టెంబర్ నెలలో నిర్వహించిన రాష్ట్ర స్థాయి కవితలు పోటీలో ప్రథమ బహుమతి రూ. 3,116/- జనజ్వాల - వనపర్తి, ద్వితీయ బహుమతి రూ. 2,116/- నల్లా నరసింహమూర్తి - అమలాపురం, తృతీయ బహుమతి రూ. 1,116/- మౌనశ్రీ మల్లిక్ హైదరాబాద్‌లకు లభించాయి. కవితల పోటీకి న్యాయనిర్ణేతగా రాళ్ళబండి కవితా ప్రసాద్ వ్యవహరించారు. నవంబర్ 6వ తేదీన నెల్లూరులో 'నెరసం' ఆధ్వర్యంలో జరిగిన రాష్ట్రస్థాయి శతాధిక కవి సమ్మేళనంలో విజేతలకు నగదు బహుమతితో పాటు సత్కరించినట్లు ఆ సంస్థ కార్యదర్శి పాతూరి అన్నపూర్ణ తెలిపారు. తెలిపారు. సంస్థ అధ్యక్షులు ఎ. జయప్రకాష్, కార్యదర్శి పాతూరి అన్నపూర్ణ, ప్రముఖ కవి, నటులు రంగనాథ్, సాహిత్య విమర్శకులు ద్వానా శాస్త్రి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారని తెలిపారు.




నవంబర్ 6న నెల్లూరుజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన రాష్ట్ర స్థాయి శతాధిక కవి సమ్మేళనం సందర్భంగా జరిగిన "దశ దిశలు" పుస్తకావిష్కరణ సభలో పాల్గొన్నవారు అధ్యక్షులు ఎ.జయప్రకాష్, కార్యదర్శి పాతూరి అన్నపూర్ణ, నగర శాసన సభ్యులు ముంగమూరి శ్రీధర కృష్ణారెడ్డి, ప్రముఖ నటులు, కవి రంగనాథ్, ప్రముఖ సాహిత్య విమర్శకులు ద్వానా శాస్త్రి తదితరులు

# ఇ.సి.ఐ.ఎల్. కార్మికుల రచనల సంకలనం 'సాధన' ఆవిష్కరణ

ఇసిఐఎల్ వ్యవస్థాపకులు ఎ.ఎస్. రావు 8వ వర్ధంతి సందర్భంగా ఇసిఐఎల్ కవులు, రచయితలు తయారు చేసిన సాధన పుస్తకాన్ని ఇసిఐఎల్ టెక్నికల్ డైరెక్టర్ ఎన్ఎస్ఎస్ ప్రసాద్‌రావు, ప్రముఖ పండితులు, విశ్లేషకులు మోతుక్కూరి నరహరి అక్టోబర్ 30న ఆవిష్కరించారు. ఇసిఐఎల్ సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఐదు సంవత్సరాలుగా ఇసిఐఎల్ ఉద్యోగులతో రచన సంకలనాలు ప్రచురిస్తున్నట్టు నగర సాహితీ స్రవంతి కార్యదర్శి జి. యాదగిరిరావు తెలిపారు. స్ఫూర్తి, ముందడుగు, మార్గదర్శి, నీరాజనం, నేడు సాధన సంకలనాలను తీసుకొని వస్తున్నామని తెలిపారు. ఇసిఐఎల్ టెక్నికల్ డైరెక్టర్ ఎన్.ఎస్.ఎస్. ప్రసాద్‌రావు మాట్లాడుతూ ఎ.ఎస్. రావు కృషి ఫలితంగానే హైదరాబాద్‌లో ఇసిఐఎల్ ఏర్పడిందని, దేశంలోనే ఎలక్ట్రానిక్ పరిశ్రమగా అభివృద్ధి పరచి దేశవిదేశాల్లో పేరు సంపాదించారని తెలిపారు. ఎ.ఎస్.రావు ఆశయ సాధన కోసం పనిచేస్తూ 5 సంవత్సరాలుగా సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో కార్యక్రమాలు నిర్వహిస్తూ కవులను, రచయితలను ప్రోత్సహించే విధంగా కృషి చేయడం నిజమైన నివాళి అని అన్నారు. ఈ కార్యక్రమంలో ఎ.ఎస్. రావునగర్ సొసైటీ అధ్యక్ష కార్యదర్శులు ఆర్.వై.ఎస్. శర్మ, కె.కె.బి.ఎ. శర్మ, కాప్రా డివిజన్ కార్పొరేటర్ కొత్త రామారావు, సాహితీ స్రవంతి, ఇసిఐఎల్ కన్వీనర్ గిన్నె ఆనంద్‌రావు, మురళి, కవులు, కళాకారులు పాల్గొన్నారు.



నాటికలో ఒక సన్నివేశం

### ఆకట్టుకున్న పద్మవ్యూహం నాటిక

ఇసిఐఎల్ అభ్యుదయ ఆర్ట్స్ రచయిత ఎల్‌బి శ్రీరాం దర్శకత్వం బి. సోమయ్య ఆధ్వర్యంలో ప్రదర్శించిన పద్మవ్యూహం నాటిక ప్రేక్షకులను విశేషంగా ఆకట్టుకుంది. నగరంలో నివసిస్తూ చాలీచాలని జీతాలతో కుటుంబ పోషణ భరించలేక ఉద్యోగులు ఎదుర్కొంటున్న ఇబ్బందులు, ప్రభుత్వం చేస్తున్న పనులతో నలిగిపోతున్న సామాన్య ప్రజల అద్దెల గురించి నాటిక ప్రదర్శించారు. అలాగే ప్రభుత్వ ఆసుపత్రులు సామాన్య ప్రజలకు అందుబాటులో లేకుండా అందులో పనిచేస్తున్న వైద్యులు ప్రైవేట్ క్లినిక్‌లు నిర్వహిస్తూ వైద్య సేవలను అందించడం లేదని ప్రదర్శించారు.

---

# యగళ్ల ఫౌండేషన్ పురస్కారాలు



డా॥ శివారెడ్డి



వంశీ



డా॥ వి. చంద్రశేఖరరావు

శ్రీకాకుళం జిల్లాకు చెందిన యగళ్ల ఫౌండేషన్ 2012 సంవత్సరానికి యగళ్ల ఫౌండేషన్ అవార్డులను ప్రకటించింది. యగళ్ల సీతారామమూర్తి సాహిత్య పురస్కారాన్ని ప్రముఖ సాహితీవేత్త డాక్టర్ శివారెడ్డికి, యగళ్ల రామకృష్ణ, డాక్టర్ పద్మ సాహిత్య పురస్కారాన్ని సినీ దర్శకుడు, రచయిత ఎన్. వంశీకి, యగళ్ల సుశీల సాహిత్య పురస్కారాన్ని డాక్టర్ వి. చంద్రశేఖర రావుకు, విశిష్ట పురస్కారాలకు – గిరిధర్ గౌడ్ (చిత్రకారుడు), డాక్టర్ కోడూరి ప్రభాకర్ రెడ్డి (రచయిత), వాసిరెడ్డి నవీన్ (రచయిత, విమర్శకుడు), విశ్వేశ్వరరావు (శ్రీశ్రీ ప్రింటర్స్ అధినేత), సీతారాం (కవి, విమర్శకుడు), గుడిపాటి (పాలపిట్ట సంపాదకుడు)లను ఎంపికచేసినట్లు ఆ సంస్థ ప్రతినిధి యగళ్ల రామకృష్ణ ఒక ప్రకటనలో తెలిపారు. 2012, జనవరి 7న శ్రీకాకుళంలో ఈ పురస్కారాలను ప్రదానం చేయనున్నట్లు తెలిపారు. ఇదే సభలో డా. వి. చంద్రశేఖర రావు తాజా కథా సంపుటి 'ద్రోహ వృక్షం' ఆవిష్కరించనున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు.

---

### గమనిక

డైరీ కాలమ్‌కి సాహిత్య వార్తలు పంపేవారు క్లుప్తంగా రాసి పంపాలి * సభలో పాల్గొన్న వారందరి పేర్లు రిపోర్టులో రాయకూడదు * ఆలస్యమైన వార్తల్ని పంపించకూడదు * తాజా వార్తలకే ప్రచురణకు అవకాశం ఉంటుంది * మాకు చేరుతున్న కొన్నింటిలో తేదీలు రాయడం లేదు * ఫొటో వెనుక తప్పని సరిగా ఆ కార్యక్రమం జరిగిన తేదీ, ప్రాంతం, జిల్లా పేర్లు రాయాలి.

# విజయనగరంలో సాహితీ సభలు

## గ్రంథాలయోత్సవం

విజయనగరంలో సాహితీస్రవంతి, యువస్పందన సంయుక్త ఆధ్వర్యంలో నవంబర్ 17న 44వ జాతీయ గ్రంథాలయోత్సవం జరిగింది. ఈ సందర్భంగా కవి, గాయక సమ్మేళనం నిర్వహించారు. చంద్రికారాణి, హైమవతి, రాజా చంద్రశేఖర్, రాంగలి పోతనలు ఈ కార్యక్రమాన్ని సమన్వయం చేసారు. నలభై మంది తమ కవితలను, పాటలను విన్పించి సభికులను అలరించారు. కడలి ప్రకాశరావు, చెళ్ళపిళ్ళ శ్యామల, పి.యస్.యస్. లక్ష్మి, దేశిరాజు సత్యవాణి, ఇనపకుర్తి చినసత్యన్నారాయణ, బులుసు సరోజినీ దేవి, యస్.పి. నాయుడు, రాజశేఖర్, పి.యస్. శ్రీనివాస్, జె. విజయలక్ష్మి, రెడ్డి శంకర్రావు, తామరపల్లి రామకృష్ణ, చివుకుల శ్రీలక్ష్మి, పూషీకేశం, ఆర్.కె. చౌదరి తదితరులు కవితలు చదివారు. గ్రంథాలయాలు, అవినీతి, బాల కార్మికులు, వాల్‌స్ట్రీట్ ఉద్యమాలు, మహిళా హింస, మానవతా విలువల విధ్వంసం తదితర అంశాలను స్పృశిస్తూ సాగిన ఈ కవిగాయక సమ్మేళనం ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది.

### సాహితీవేత్తల సంస్మరణ

కొడవటిగంటి కుటుంబరావు జయంతిని పురస్కరించుకొని అక్టోబర్ 28న విజయనగరంలో సాహితీస్రవంతి 'మెరుగు' వేదిక ఆధ్వర్యంలో ఇటీవల కన్నుమూసిన పలువురు సాహితీవేత్తలకు నివాళులర్పించారు. ఈ కార్యక్రమాన్ని సమన్వయం చేసిన కవయిత్రి చెళ్ళపిళ్ళ శ్యామల ప్రముఖ సినీ పాటల రచయిత జాలాది సాహిత్యకృషిని వివరించారు. ప్రముఖ సాహిత్యవేత్త, సంపాదకులుగా కృషిచేసిన నండూరి రామమోహనరావు కృషి గురించి కృష్ణారావు మాట్లాడారు. అవసరాల రామకృష్ణారావు రచనలపై చాగంటి తులసి మాట్లాడారు. విస్తారంగా సాహితీవ్యవసాయం చేసిన కొడవటిగంటి కుటుంబరావు సాహిత్యంపై శ్రీరామమూర్తి ప్రసంగించారు. చివరగా ఈ అందరినీ స్మరిస్తూ సీనియర్ సాహిత్యవేత్త యు. నరసింహామూర్తి ప్రసంగించారు. అనంతరం సమావేశానికి హాజరయిన కవులు తమ కవితలను చదివారు. గాయకులు పాడిన పాటలు అందరినీ అలరించాయి.

**- ఇల్ల ప్రసన్నలక్ష్మి**

# 44వ గ్రంథాలయ వారోత్సవాల్లో కవి సమ్మేళనం

నవంబర్ 17న హైదరాబాద్‌లో సరూర్‌నగర్‌లోని శాఖా గ్రంథాలయంలో కవి సమ్మేళనం జరిగింది. గ్రంథాలయ గ్రంథ పాలకుడు జానకి రాములు ఈ కవి సమ్మేళనం సమన్వయం చేశారు. ఊసల రజనీ గంగాధర్ కవి సమ్మేళనం నిర్వహించి స్వీయ కవితలు పద్యాలు ఆలపించారు. ఈ సమ్మేళనంలో పొత్తూరి సుబ్బారావు తంగిరాల చక్రవర్తి, ఎస్. వివేకానంద, జి. విజయశ్రీ, కొండపల్లి నీహారిణి, కె. రాజ్యశ్రీ, పొత్తూరి జయలక్ష్మి, జి. అప్పారావు, మౌనశ్రీ మల్లిక్, పెద్దూరి దాసు, చిమ్మపూడి శ్రీరామమూర్తి, గోపాల కృష్ణమూర్తి, నరేంద్ర కాలనీ పెద్దలు తదితరులు పాల్గొని ప్రసంగించారు. అక్షరం, పుస్తకం - అనే అంశాలు వస్తువుగా తీసుకొని రాసిన కవితలు ఆహుతుల్ని అలరించాయి. కవులు, రచయితలు వచ్చి సాహిత్య కార్యక్రమాలు నిర్వహించుకోదలిస్తే తమ శాఖా గ్రంథాలయం సభలకు సహకరిస్తుందని గ్రంథ పాలకులు జానకి రాములు తెలియజేసి పాల్గొన్న అందరికీ ధన్యవాదాలు తెలిపారు.




ఒడిశా రాయగడ 'స్పందన' వార్షికోత్సవ సభలో కథల పోటీ విజేతగా విశిష్ట అతిథి నాయుడు వెంకట రమణ చేతుల మీదుగా నగదు బహుమతితో ప్రశంసాపత్రం అందుకుంటున్న కథా రచయిత గుండాన జోగారావు. మధ్యలో సంస్థ అధ్యక్షులు ఆనందరావ్ కుమందాన్



నవంబర్ 14వ తేదీన "రసభారతి" 30వ వార్షికోత్సవ శుభ సందర్భంగా శివరామకృష్ణ క్షేత్రం (రామకోటి), విజయవాడలో జరిగిన సన్మాన సభలో ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న ప్రతిష్ఠాత్మకమైన "విశిష్ట సాహితీ పురస్కారం" అందుకున్నారు. చిత్రంలో (ఎడమనుంచి) డి.ఆర్. మాధవన్, జె. ప్రభాకరశాస్త్రి, డా॥ జంధ్యాల పరదేశిబాబు, టి. శోభనాద్రి, గుర్రం రామ్మోహనరావు, డా॥ యల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, గోళ్ళ నారాయణ, డా॥ గుమ్మా సాంబశివరావు, సాధు మల్లికార్జునరావు, జె. సాంబిరెడ్డి

# సాహితీస్రవంతి

## అనంతపురం జిల్లా కమిటీ ఏర్పాటు



సాహితీ స్రవంతి నూతన జిల్లా కమిటీ నవంబర్ 12న టవర్‌క్లాక్ దగ్గర మున్సిపల్ కాంప్లెక్స్‌లో ఉన్న జనవిజ్ఞానవేదిక కార్యాలయంలో జరిగిన సమావేశంలో ఏర్పడింది. ఈ సమావేశానికి తగరం క్రిష్టయ్య అధ్యక్షత వహించారు.

**సాహితీ స్రవంతి నూతన జిల్లా కమిటీ**

జిల్లా అధ్యక్షులు : పిల్లే కుమారస్వామి, జిల్లా ప్రధాన కార్యదర్శి : తగరం క్రిష్టయ్య, జిల్లా ఉపాధ్యక్షులు : డా॥ అంకె రామలింగమయ్య, ఎర్రిస్వామి. జిల్లా సహాయ కార్యదర్శులు : ఆకుల రఘురామయ్య, ముకుందాపురం పెద్దన్న, జిల్లా కోశాధికారి సురేష్. సభ్యులు : ఆవుల జయప్రద, శివన్న, ఇస్మాయిల్, మంజుల బాయి, రామకృష్ణ, వసంతబాబు, శేషాచార్యులు, జూటూరి షరీఫ్ డా॥ఎ.ఆదెప్ప, ఆనందకుమార్, టి.వి.రెడ్డి, కేశవ్, రియాజ్, నాగేంద్ర.

రాజకీయ, ఆర్థిక, సామాజిక ప్రాపంచిక పరిణామాలు చోటు చేసుకుంటున్న సందర్భంలో సాహితీ స్రవంతి కమిటీ ఏర్పాటు అభినందనీయమని తగరం క్రిష్ణయ్య అన్నారు. సాహితీ స్రవంతి సామాజిక మార్పును కోరుతూ, అనంతపురం జిల్లాలో 2000 సం॥ నుండి ప్రముఖ సాహితీవేత్తల సామాజికవేత్తల జయంతులు, వర్థంతులు నిర్వహిస్తున్నామని, అలాగే అవినీతి, స్కామ్‌లు, భూ పోరాటాలు, దుర్రాకమాలు, స్త్రీ సమస్యలు, దళిత బహుళజాతి సమస్యలు, రైతుల శ్రామికుల చేనేత సమస్యలపై కులమత వర్గ పోరాటాలపై, కవి సమ్మేళనాలు, కవితల పోటీలు, సాహిత్య వర్కు షాపులు నిర్వహిస్తున్నామని అధ్యక్షులు కుమార స్వామి అన్నారు. సాహితీ స్రవంతి అనంతపురం జిల్లా స్థాయిలో సాహిత్య కృషి మరింత విస్తృతంగా కొనసాగిస్తామన్నారు.

## ఘనంగా విశ్వనరుని జయంతి

ఆధునిక వ్యవస్థలో ధృవతారగా వెలిగి. సాహితీ రంగానికి వన్నె తెచ్చిన విశ్వనరుడు గుర్రం జాషువ అని కవి జనజ్వాల విద్యాధికారులు జి.యం.యం. మధుకర్, లక్ష్మణ నాయక్‌లు కొనియాడారు.

మహబూబ్‌నగర్ జిల్లా వనపర్తి పట్టణంలోని జడ్పీహెచ్ (బాలుర) ఆవరణంలో స్థానిక సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 28న 116వ జయంతి సభ జరిగింది. ఈ సభకు సాహితీ స్రవంతి డివిజన్ అధ్యక్షుడు డి. కృష్ణయ్య అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా జాషువా చిత్రపటానికి పూలమాలవేసి ఘనంగా నివాళ్ళు అర్పించారు. అనంతరం జరిగిన సభలో జనజ్వాల ప్రసంగిస్తూ అణగారిన వర్గాలు, దళితుల బాధలను గబ్బిలం ద్వారా ప్రపంచానికి చాటిన వ్యక్తి జాషువా అని అన్నారు. సాహితీ దిగ్గజాల సరసన ఎదిగిన గొప్ప కవి అని చెప్పారు. కార్యక్రమంలో శ్రీమతి లలితమ్మ, గోపాల్, డి. కృష్ణయ్య, సంజీవ్, వెంకటేష్ తదితరులు జాషువాపై కవితలు వినిపించారు.



గుర్రం జాషువ జయంతి సభలో ప్రసంగిస్తున్న ఎం.వి.ఓ. మధుకర్

కార్యక్రమంలో సాహితీ స్రవంతి నాయకులు భీమయ్య, బి.వెంకటేష్, కూర్మయ్య పాల్గొన్నారు.

## రసరాజుకు డా॥ నాగభైరవ అవార్డు

ప్రముఖ కవి, రచయత, సినీ గేయ రచయిత రసరాజు ప్రతిష్టాత్మక 2011 డా॥ నాగభైరవ అవార్డుకు ఎంపికయ్యారు. వారికి డిసెంబర్ 11న నెల్లూరు టౌన్‌హాల్లో జరగబోవు డా॥ నాగభైరవ అవార్డు ప్రధానోత్సవంలో ఈ అవార్డు ప్రదానం చేయనున్నట్లు కమిటీ ప్రధాన కార్యదర్శి చిన్న నారాయణరావు ఒక ప్రకటనలో తెలిపారు. గతంలో ఈ అవార్డును డా॥ మల్లెమాలకు, దర్భశయనం శ్రీనివాసాచార్యకు ఇవ్వడం జరిగిందని తెలిపారు.

# 'సోమేపల్లి' పురస్కారాల విజేతలు

ఇటీవల 'రమ్యభారతి' సాహిత్య త్రైమాసపత్రిక ఆధ్వర్యంలో నిర్వహించిన 'సోమేపల్లి' స్మారక చిన్న కథల పోటీ పురస్కారాల విజేతల వివరాలను ప్రకటించారు. ఈ పోటీలకు మొత్తం 77 కథలు పరిశీలనార్థం వచ్చాయి. వీటిలో న్యాయనిర్ణేత అత్యుత్తమ ప్రథమ స్థాయికి అర్హత కలిగిన కథ రాలేనందున దానిని రద్దు చేసి ద్వితీయ స్థాయి పురస్కారానికి రెండు కథలు ఎంపిక చేయబడ్డాయని చలపాక ప్రకాష్ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పోటీలకు న్యాయనిర్ణేతగా ప్రముఖ రచయిత గుత్తుల భాస్కరరావు వ్యవహరించారు. మాకినీడి సూర్య భాస్కర్ (కాకినాడ) రచన 'హత్య చెయ్యనవసరం లేదు', యస్వీ కృష్ణజయంతి (హైదరాబాద్) రచన 'తొలగిన తెర' ద్వితీయ స్థాయి 'సోమేపల్లి' పురస్కారాలకు ఎంపికయ్యాయి. తృతీయ స్థాయి 'మంచి కథ'గా నెల్లూరుకు చెందిన పాతూరి అన్నపూర్ణ రచన 'నాన్న కోసం' ఎంపికయ్యింది. ప్రత్యేక పురస్కారాల కింద నడిపల్లి శైలజ (చెన్నై) రచన 'మానవ పరిమళం', యలమర్తి అనూరాధ (తణుకు) రచన 'తస్మాత్ జాగ్రత్త', కొత్తపల్లి ఉదయబాబు (తాడేపల్లిగూడెం) రచన 'వెన్నెల నీడ', యన్వీ.ఎస్. నాయుడు (విశాఖపట్నం) రచన 'కొంచెం చేదు - కొంచెం వగరు' ఎంపికయ్యాయి. పురస్కార గ్రహీతలను డిసెంబర్ మూడవ వారంలో జరిగే ప్రత్యేక సభలో నగదు జ్ఞాపిక, శాలువాలతో సత్కరించబడుతుందని తెలిపారు.

# మంత్రి కృష్ణమోహన్‌కు సోమిరెడ్డి జమున స్మారక పురస్కారం



'సోమిరెడ్డి జమున స్మారక రాష్ట్రస్థాయి అవార్డు 2011' కు మార్కాపురం కవి మంత్రి కృష్ణమోహన్ రాసిన నానీల సంపుటి 'మట్టి పలకలు' ఎంపికయినట్టు డాక్టర్ పెళ్ళకూరు జయప్రద ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పురస్కార ప్రదానోత్సవ సభ డిసెంబర్ 18న నెల్లూరు పట్టణంలోని ఇండియన్ మెడికల్ అసోసియేషన్ హాలులో జరపనున్నట్లు తెలిపారు. ఈ సభలో మంత్రి కృష్ణమోహన్‌ను ఐదువేల రూపాయల నగదు బహుమతితో సత్కరించడం జరుగుతుందని తెలిపారు. అదే కార్యక్రమంలో డాక్టర్ జయప్రద, వి. ప్రతిమ, దోర్నాదుల సుబ్బమ్మల సంయుక్త కథానంపుటి 'సంప్రజ' ఆవిష్కరించనున్నారు. నానీల కవిసమ్మేళనంలో పాల్గొన్న కవులకు పుస్తక సమర్పణ కార్యక్రమం ఉంటుందని తెలిపారు. ఇతర వివరాలకు 9440279594 ద్వారా సంప్రదించవచ్చును.

# కవితల పోటీ

బాలికా భ్రూణ హత్యలను నిరసిస్తూ వచన కవితలను ఆహ్వానిస్తున్నట్లు న్యూవిజన్ సోషల్ మొబలైజేషన్ అండ్ రూరల్ డెవలప్‌మెంట్ సొసైటీ కార్యదర్శి ఉదయ్ కిరణ్ ఒక ప్రకటనలో తెలిపారు. డిసెంబర్ 31 లోపు కవితలను ప్రెసిడెంట్, న్యూ విజన్ సోషల్ మొబలైజేషన్ అండ్ రూరల్ అర్బన్ డెవలప్‌మెంట్ సొసైటీ, ఇం. నెం. 8-333/3, భానోదయ ఇంగ్లీషు మీడియం స్కూల్, పిడుగురాళ్ళ-522 413 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. వచ్చిన కవితలలో ఐదు ఉత్తమ కవితలకు ఒక్కొక్క కవితకు రూ. 1,000/- చొప్పున కవులకు అందించనున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు. ఇతర వివరాలకు 9441214212 నెంబరులో సంప్రదించవచ్చును.



విశాఖపట్నంలోని టర్నర్ చౌల్ట్రీ ప్రాంగణంలో వేంపల్లె షరీఫ్ రాసిన కథల సంపుటి 'జుమ్మా' పరిచయం కార్యక్రమం. చిత్రంలో విమర్శకుడు రామతీర్థ, రచయిత ఎల్.ఆర్. స్వామి, జుమ్మా రచయిత వేంపల్లె షరీఫ్ తదితరులు

# ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు

24వ ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు కోసం కవుల నుండి కవితా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్టు అవార్డు వ్యవస్థాపకులు డా॥ రాధేయ ఒక ప్రకటనలో తెలియజేశారు. అవార్డు పరిశీలన కోసం 2011లో ప్రచురింపబడిన వచన కవితా సంపుటాలను మాత్రమే పంపాలి. ఎంపికైన ఉత్తమ కవితా సంపుటికి రు. 2000/- (రెండువేల రూపాయలు) నగదు మరియు షీల్డుతో కవికి సత్కారం వుంటుంది. 31-1-2012వ తేదీలోగా 4 ప్రతులను ఈ క్రింది చిరునామాకు పంపవలసిందిగా కోరారు. డా॥ రాధేయ, వ్యవస్థాపకులు, కవితా నిలయం, ఇంటి నెం. 13-1-606-1, షిర్డినగర్, రెవెన్యూ కాలనీ, అనంతపురం-5... ...95171411



'ప్రపంచ తెలుగు - తొలి అడుగు' సభ నవంబర్ 4న ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం ఇతర సాహిత్య సంస్థల ఆధ్వర్యంలో జరిగిన సభలో ప్రసంగిస్తున్న డా॥ దొనబాబు (సిలికానాంధ్ర, అమెరికా), ఈ సభలో ఎడమ నుండి గుత్తికొండ కొట్టిరామారావు (సభాధ్యక్షుడు), మండలి బుద్ధప్రసాద్, పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్, ప్రొఫెసర్ ఎమ్.కె. దుర్గాప్రసాద్‌కు (VC/K4), డా॥ ధన్వంతరి, కూచిభొట్ల ఆనంద్ (సిలికానాంధ్ర, అమెరికా వ్యవస్థాపక అధ్యక్షుడు) ప్రొ॥ జె. చెన్నయ్య, డా॥ పూర్ణచంద్

# 'దీపావళి' కవి సమ్మేళనం




ఖమ్మంలో జరిగిన సాహితీ స్రవంతి 'దీపావళి కవి సమ్మేళనం' లో మాట్లాడుతున్నవారు బివికె మేనేజర్ కందాడై శ్రీనివాస్, కుడివైపు కృష్ణమూర్తి, ఎడమవైపు తాటికొండాల నరసింహారావు, రౌతు రవి, సంపటం దుర్గాప్రసాదరావు

దీపావళి వెలుగుల దివ్వెలు సామాన్యులకు అందుబాటులో లేవని, అధిక ధరలతో జనం అల్లాడుతున్నారని, పాలకులు ప్రజల పక్షాన నరకాసురులుగా వున్నారని, సామాన్యుల గురించి ఆలోచించక, అధికార కుర్చీల కోసం ఆటలాడుతున్నారని సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి కె. ఆనందాచారి ఆవేదన వ్యక్తం చేశారు. రోజుకో రూపంలో సామ్రాజ్యవాదం విరుచుకుపడుతూ, చిన్న దేశాలపై రాబంధులా వాలి, లేని పేదరికం తగిలించుకుని పెత్తనం చేస్తూ, సైన్యాన్ని దించి సమస్యలు సృష్టిస్తూ పెద్దన్న పాత్రలో సద్దాం హుస్సేన్, గడాఫీ లాంటి వారిని చంపి రక్తదాహం తీర్చుకుంటుందని ఆరోపించారు. అమెరికన్ సామ్రాజ్యవాదం యెడల అప్రమత్తంగా వుండాలని కోరారు.

దీపావళినాడు అక్టోబర్ 26న ఖమ్మం పట్టణంలో మంచికంటి మీటింగ్ హాలులో సాహితీ స్రవంతి కవి సమ్మేళనం నిర్వహించగా ప్రముఖ కవి తాటికొండాల నరసింహారావు అధ్యక్షత వహించగా, కృష్ణమూర్తి, సంపటం దుర్గాప్రసాదరావు వేదికపై ఆశీనులు కాగా సాహితీ స్రవంతి జిల్లా కార్యదర్శి రౌతు రవి కవి సమ్మేళనాన్ని సమన్వయం చేశారు.

కవి సమ్మేళనాన్ని ఉద్దేశించి బోడేపూడి విజ్ఞాన కేంద్రం మేనేజర్ కందాడై శ్రీనివాసులు నేటి కవి సమ్మేళనంలో ఆలపించిన కవితలు ఎంతో చైతన్యవంతంగా , స్ఫూర్తిదాయకంగా, ప్రజా జీవన స్థితిగతులకు అద్దంపట్టేలా వున్నాయని, చెట్టుమీద, పుట్ట మీద కన్నా సమకాలీన జీవన పరిస్థితులు ప్రతిబింబిస్తూ ప్రజల పక్షాన రాస్తే కవిత్వం కొంతకాలం నిలబడుతుందని, ఈనాటి యువకవులు ఈ బాధ్యతను స్వీకరించాలని కోరారు. సాహితీ స్రవంతిలో అదే కొనసాగుతుందని, ఇక ముందు కొనసాగాలని ఆకాంక్షించారు.



నవంబర్ 7న నెల్లూరులో సృజన సాహిత్య వేదిక ఆధ్వర్యంలో రాష్ట్ర స్థాయి కవితల పోటీలో 'ఒక్కమాట చాలు' కవిత ఉత్తమ కవితగా ఎంపికైన సందర్భంగా ప్రముఖ కవి కాళహస్తి వెంకట శేషగిరిరావును రూ.1000/-లు నగదు, సన్మానపత్రం, జ్ఞాపికతో ఘనంగా సహకరిస్తున్న కె. కామేశ్వరరావు, కొత్తపల్లి సురేష్‌శర్మ, వదలి రాధాకృష్ణ, యం.ఆర్.వి. సత్యనారాయణమూర్తి ఆర్.వి. శేషయ్యనాయుడు, సినీ కవి కె. మురళీ మోహన్‌రాజు, సృజన అధ్యక్షులు దగ్గుపాటి రాధాకృష్ణ

కన్నెగంటి వెంకటయ్య ఆలపించిన స్వీయ గజల్ రక్తి కట్టించగా, ఎం. శేషగిరి ఆలపించిన పదవే గీతమా పద పదవే... ఉద్రూతలూగించింది. డాక్టర్ సిహెచ్. ఆంజనేయులు "చీకటి" కవిత ఆధిపత్య రాజ్యాలపై అంకుశమై సాగింది. జి. లెనిన్ శ్రీనివాస్ 'మరో దీపావళికై' - కవితాలాపన 'ఎండిన పంటపొలాల్లో / నిప్పుకు నిలువునా దహింపజేసి / గుండెబండ బారిన గడ్డుకాలం / హృదయ విలాపంలో హోలికులంటూ' నేటి జీవన చిత్రాన్ని ఆవిష్కరించారు. కొత్తా శంకర్‌రెడ్డి తన కవితలో సకల జనం సంకట స్థితిలో / పాలకులు మొద్దునిద్రలో/ పరిపాలనా విభాగం అస్తవ్యస్థం అంటూ ఆవేదన వ్యక్తం చేశారు. పోతగాని సత్యనారాయణ తన కవితలో - వాల్‌మార్ట్ సామ్రాజ్యవాద సంస్కృతిలో, చిల్లర దుకాణదారుల బ్రతుకుల్లో చీకటి నింపుతుందని, ఇది పెట్టుబడిదారుల పన్నాగమనీ, దోచుకునే మార్గమనీ దీన్ని నిశితంగా నిలదీశారు. వైద్యం భాస్కర్ (హౌసింగ్ బోర్డు ఇ.ఇ) ప్రగాఢ ఆకాంక్షల పవిత్ర పోరాటాల నడుమ, సామాన్యులు జరుపుకోలేని దీపావళిలు ఎన్ని వస్తేనేం, మదినిండా మనోవేదన, మనిషిని ప్రశ్నిస్తుంటే అంటూ ఆవేదన వ్యక్తం చేశారు. కవి సమ్మేళనంలో మరో యువకవి వి. విజయరామరాజు (భూగర్భ గనులు, రాయల్టీ ఇన్‌స్పెక్టర్) పాల్గొని నిత్యావసరాలు నింగికి తారాజువ్వల్లా, అవినీతి అవధులు దాటిపోయి, గనులు, నిధులు దోచుకోబడుతూ, సామాన్యులకు అందాల్సిన సంపద దోపిడీదారులు దోచేస్తున్నారని పేర్కొన్నారు. బోడేపూడి విజ్ఞాన కేంద్రం నుండి సముద్రాల వేణుగోపాలరావు, జానకి రామారావు, ప్రసాద్, హేమంత్, నారాయణరావు ... పాల్గొన్నారు.



ఎస్.వి.డి. సాహితీ సంస్థ హైదరాబాద్ ఆధ్వర్యంలో నవంబర్ 17న శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం నందు నిర్వహించిన సభలో దీపావళి - 2011, వచన కవితా సంపుటి పురస్కార గ్రహీతలు మొదటి వరుస గిరిప్రసాద్, యస్. వివేకానంద, (ఎడమ నుండి కుడికి) శీలా వీర్రాజు, గోపి, ఆకెళ్ల విజేతలు రెండవ వరుస : పి. శ్రీనివాసగౌడ్, ర్యాలీ ప్రసాద్, పొత్తూరి సుబ్బారావు, ఎస్.వి. రామశాస్త్రి, పి. లక్ష్మణరావు.



నవంబర్ 17న శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం హైదరాబాదులో యస్. వివేకానంద రాసిన కవితా సంపుటి 'నేటి భాగోతాలు' ఆవిష్కరణ. ఆవిష్కర్త శీలా వీర్రాజు, రచయిత ఎన్. గోపీ, ఆకెళ్ల



డా॥ఎన్.గోపి రచించిన 'నానీలు'నకు రష్యన్ అనువాదం 'శ్చిఖత్వోర్నియే మీని అచూరి' (Poetic Meniature) అనే గ్రంథాన్ని ఢిల్లీలోని సాహిత్య అకాడమీ ఆడిటోరియంలో ఆవిష్కరిస్తున్న రష్యా రాయబారి అలిక్ సాందర్ మీఖాలవిచ్ కదాకీన్. చిత్రంలో ప్రముఖ హిందీ కవి, విమర్శకుడు ప్రొఫెసర్ నామ్‌వర్‌సింగ్ సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షుడు విశ్వనాథ్ ప్రతాప్ తివారీ, ఆవిష్కర్త కదాకీన్, అనువాదకుడు ఇఫ్లూ యూనివర్సిటీ డీన్, స్కూల్ ఆఫ్ రష్యన్ స్టడీస్ ప్రొఫెసర్ వినయ్‌తోటావర్



హాస్యావధాని జె.ఎల్. నరసింహం రచించిన "నానీలహరి" కవితా సంపుటిని హైదరాబాదు త్యాగరాయగాన సభలో అక్టోబర్ 19న జ్ఞానపీఠ పురస్కార గ్రహీత డా॥ సి.నారాయణరెడ్డి ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో గ్రంథ సమీక్షకులు డా॥ఎస్. రఘు, కృతి స్వీకర్త ఎం. నిరంజన్‌గారు, ఉస్మానియా వి.సి. ప్రొ॥ ఎస్.సత్యనారాయణ, నానీల సృష్టికర్త డా॥ఎన్.గోపి, సినీనటులు రంగనాథ్, అభినందన భవాని రచయిత జె.ఎల్. నరసింహం, ప్రొ॥ సాయిప్రకాష్



చెన్నైలో నవంబర్ 1న ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భంగా నిర్వహించిన సాహిత్య కార్యక్రమంలో విద్యార్థికి బహుమతి అందజేస్తున్న కె. సుబ్రహ్మణ్యరాజు, చిత్రంలో గుడిమెట్ల చెన్నయ్య తదితరులు





అక్టోబర్ 30న మార్కాపురం నెలనెలా వెన్నెల వేదికలో పద్యకవి ఉన్నం జ్యోతివాసును సన్మానిస్తున్నవారు. కార్యదర్శి కె.వి. రమణారెడ్డి, ఆంథోని, మంత్రి క్రిష్టమోహన్, పర్వతాచారి, ఓరుగంటి మల్లిక్, కె. మధుసూధన శాస్త్రి, తోట శ్రీనివాసరావు

# గురజాడ 150వ జయంతి

# అద్దేపల్లికి భారతి పురస్కారం



అద్దేపల్లికి చిన్నప్ప భారతి పురస్కారం ప్రధానం

ప్రపంచీకరణ విధానాలను ఎండగట్టేందుకు 'కన్యాశుల్కం' లాంటి రచన మరొకటి రావాల్సిన అవసరముందని సాహితీ వక్తలు అభిప్రాయపడ్డారు.మారాలి అనుకునే ప్రతి ఒక్కరికీ గురజాడ దిక్సూచి అని, మార్పు కోసం ఆయన చేసిన రచనలు అద్వితీయమని కొనియాడారు. తిరుపతి ఎస్‌వి యూనివర్శిటీ సెనెట్‌హాల్‌లో సాహితీ స్రవంతి, ఎస్‌వి యూనివర్శిటీ తమిళ విభాగం సంయుక్త ఆధ్వర్యంలో గురజాడ 150వ జయంతి ఉత్సవాన్ని నవంబర్ 2న ఘనంగా నిర్వహించారు. సాహితీ స్రవంతి అధ్యక్షులు, సభాధ్యక్షులు తెలకపల్లి రవి మాట్లాడుతూ గురజాడ 150వ జయంతి, చిన్నప్పభారతి పురస్కార సభ ఒకే వేదికపై జరగటాన్ని తమిళ, తెలుగు భాషల మధ్య రచయితల వారధిగా అభివర్ణించారు. ఆనాటి సుబ్రహ్మణ్య భారతి, కందుకూరి వీరేశలింగం దగ్గర నుండి ఈ వారసత్వం కొనసాగటం సంతోషదాయకం అన్నారు. అనంతరం చిన్నప్పభారతి పురస్కారాన్ని ట్రస్ట్ సభ్యులు, చిన్నప్పభారతి 'పొగచూరిన ఆకాశం' కవితా సంపుటి రచయిత డాక్టర్ అద్దేపల్లి రామమోహన్‌రావుకు అందజేశారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన ప్రముఖ విమర్శకులు రాచపాళెం చంద్రశేఖరెడ్డి గురజాడపై ప్రసింగిస్తూ గతించిపోయిన సమాజం గురించి రచనలు చేయడం చాలా సులభమని, అయితే మార్పులకు లోనవుతున్న, ప్రస్తుత సమాజం గురించి రచనలు చేయడం చాలా కష్టమని అన్నారు. అయితే మారుతున్న సమాజాన్ని చిత్రించడంలో గురజాడ దిట్ట అని, ఆయనకు సాటి మరెవరూ లేరని అన్నారు. గురజాడ లాంటి మహావ్యక్తిని కొన్ని వర్గాలు సంస్కృతి విధ్వంసకుడని, దేశభక్తి లేదని విమర్శిస్తున్నాయన్నారు. కుల వ్యవస్థ వంటి పాచిపట్టిన సంస్కృతిని ఆయన విధ్వంసం చేశారని చెప్పారు. భూస్వాములు జనాన్ని పీడించడాన్ని ప్రముఖంగా ఎండగట్టారని చెప్పారు. సాటి మనిషిలోనే దేవుడున్నాడని, ఎక్కడో కొండల్లో, రాళ్లల్లో లేడని మూఢ నమ్మకాలు పాతుకుపోయిన కాలంలోనే ధైర్యంగా చెప్పిన వ్యక్తి గురజాడ అప్పారావు మాత్రమేనని అన్నారు. పతియే ప్రత్యక్ష దైవం అని చెప్పే కాలంలో భార్యభర్తల మధ్య ఉండాల్సింది యాజమాని, బానిస సంబంధం కాదని, స్నేహం ఉండాలని ప్రతిపాదించిన గొప్ప సంస్కరణవాది గురజాడ అని తెలిపారు. గౌరవ అతిథిగా విచ్చేసిన యం.యల్.సి. యండపల్లి శ్రీనివాసులు రెడ్డి సభను ఉద్దేశించి ప్రసింగించారు. అనంతరం బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు విభాగానికి చెందిన డా॥ కె.ఆశాజ్యోతి గురజాడ అప్పారావుపై పత్రం సమర్పించారు. అనంతరం చిన్నప్పభారతి రచనల గురించి పలువురు ప్రసంగించారు. చిన్నప్పభారతి రచనల గురించి ప్రముఖ అనువాదకులు యతిరాజులు ప్రసంగిస్తూ క్షేత్ర స్థాయిలో అధ్యయనం చేసి ఆయన రాసిన రచనలు సంచలనమయ్యాయని, దేశంలో అనేక భాషల్లోనే కాక, విదేశాల్లో సైతం ప్రచురణలు రావడం హర్షణీయమని కొనియాడారు. ఆయనకు బహుమతిగా ఇచ్చిన ఐదు లక్షల రూపాయలను ట్రస్టుకిచ్చి, అభ్యుదయకర రచనలు చేసిన వారికి ప్రతి ఏడాది 50 వేల రూపాయలు ఇస్తూ ప్రోత్సహిస్తున్నారని తెలిపారు. తమిళంలో చిన్నప్పభారతి నవలలు ఎంత ప్రాచుర్యం పొందాయో తెలుగులో కూడా సంఘం, చక్కెర, దాహం, గని నవలలు అంతగా ప్రాచుర్యం పొందాయని అన్నారు. ఆయన నవలలు వాస్తవిక సమాజాన్ని సజీవంగా చూపిస్తాయని అన్నారు. సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి మాట్లాడుతూ ప్రసిద్ధ రచయిత అయిన చిన్నప్పభారతి తోటి రచయితలను ప్రోత్సహించాలని ట్రస్టు నెలకొల్పి పురస్కారాలు అందజేయడాన్ని అభినందించారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న చిన్నప్పభారతి మాట్లాడుతూ తన సాహిత్యం మొత్తానికి కార్మికవర్గ దృక్పథమే దిక్సూచి అన్నారు. వర్తమాన ప్రపంచంలో ముఖ్యంగా వాల్‌స్ట్రీట్ ఆందోళనల వంటివి చూసినప్పుడు కార్మికవర్గ దృక్పథంతో సృజించిన సాహిత్యం యొక్క విశిష్టత తెలుస్తుందని అన్నారు. మారుతున్న ప్రపంచంలో మరింతగా ప్రజలకు మార్గదర్శకత్వం వహించే సాహిత్యం రావాల్సిన అవసరం ఉందన్నారు. అందుకనుగుణంగానే చిన్నప్పభారతి ట్రస్ట్ తన కృషిని కొనసాగిస్తుందని తెలిపారు. సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ పురస్కార ఎంపిక నివేదికను వినిపించారు. ఎస్.వి.యూనివర్శిటీ తమిళ విభాగం ప్రతినిధులు డా. మాన్యువల్, ఆర్. మాన్యువల్, చిన్నప్పభారతి ట్రస్ట్ తరపున తమిళనాడు నుండి వచ్చిన ప్రతినిధులు సభలో ప్రసింగించారు. చివరగా డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు స్పందిస్తూ పురస్కారానికి ఎంపిక చేసినందుకు ధన్యవాదాలు తెలిపారు.

ఈ కార్యక్రమ నిర్వహణలో తిరుపతి ప్రజాశక్తి ఎడిషన్ మేనేజర్ యు. చంద్రశేఖర్, ఇతర సిబ్బంది పాల్గొన్నారు. ప్రజాశక్తి బుక్‌హౌస్ తిరుపతి మేనేజర్ రెడ్డి మునెప్ప అతిథులకు స్వాగతం పలికారు. తిరుపతికి చెందిన పలువురు రచయితలు, సాహిత్య అభిమానులు, విశ్వవిద్యాలయానికి చెందిన విద్యార్థులు, యూనివర్శిటీ తమిళ విభాగం విద్యార్థులు, ప్రజాశక్తి బుక్‌హౌస్ సిబ్బంది తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ■

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# ఉన్నవ లక్ష్మీనారాయణ

04.12.1877 - 25.09.1958



మాలపల్లి నవలా రచయిత

49



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| **పుస్తకం సంఖ్య** | PRSVM02A132 |
| **పుస్తకం పేరు** | ప్రస్థానం |
| **తారీఖు** | 25/5/24 |
| **ముందు అట్ట** | Yes |
| **వెనుక అట్ట** | Yes |
| **మొత్తం పేజీలు** | 53 |
| **పెద్ద సైజు పేజీలు** | NO |
| **ఖాళీ పేజీలు** | NO |
| **లేని పేజీలు** | NO |
| **తయారు చేసినది** | M. Lavanya |
| **పేజీలు విడదీసినది** | M. Lavanya |
| **స్కాన్ చేసినది** | Rakshitha |
| **పరీక్ష చేసినది** | NANDINI |
| **పేజీలు సరిచూసినది** | |
| **బైండింగు చేసినది** | |
| **ప్యాకింగు చేసినది** | |
| **స్కాన్ చెయ్యనివి** | |
| **తప్పులు** | NO |
| పరిస్థితి | Good. |